

పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



పూర్వ మందొక అడవిలోపల సత్వసారము అనే సింహాము



దొరకు మృగముల దొరకినట్లే సంహారిస్తూ సంచరించేది.



"ఇట్లులయితే కొన్నినాళ్లకు ఒకరమైనా మిగులబో"మని దుఃఖిమొందిన మృగములన్నీ సింహారాజును చేరబోయినవి



"రోజుకొక్కరు వంతువేసుకు తమకు ఆహారముగ వత్తుము; మిగత మృగముల మాత్ర మూరక సంహారించక వదలిపెట్టుడు"



సింహామందుకు సమ్మతించి రోజుకొక్కొక మృగము చొప్పున చప్పరించేది.

ఒకదినమ్మున మృగములన్నీ చెప్పెనొక కుందేలుపిల్లతో

"తమ్ముడా! నీవంతు వచ్చెను; సత్వసారము వేచియుండును, పొమ్ము శీఘ్రముగ!"



పాపమా కుందేలు భయమున మూర్ఛపోయి కొంతసేపటి కెట్టులో మరితెప్పరిల్లింది.



సత్వసారమునుపాయంతో మట్టుబెట్టాలంచు తలచీ కాలుగాలిన పిల్లిమల్లే తిరిగి తిరిగి ఆలసించింది.



సింహామెక్కడ వేళమించగ ఆకలేసి కేకవేస్తూ తొక తొక్కిన తాచుమల్లే చిందుతొక్కింది



ఇంతలో కుందేలు వచ్చి వణికిపోతూ ఎదుటనిలిచింది



"పంటికిందికి రాని నీవా - నాకునేటికి తిండికొచ్చావ్? ఏటికంతాలస్యమైనది? చూడు! మీమృగజాతినంతని ధ్వంసమొనరిస్తాన్!!"



"తప్పు మన్నించండి, స్వామీ! తప్పు మాత్రం నాది కాదండి."




"ఏమి చెప్పుదు, మహారాజా! పెందరాళే వచ్చుచుండగ దారిలోనొక సింహామెదురై అడ్డగించింది. ప్రభువుగారికి భోజనముననని ఎంత చెప్పిన లెక్కసేయక మిమ్ము, నన్నూ తూలనాడింది ఎట్టులోమరి బ్రతుకు జీవుడ అనుచు వచ్చితి కనికరించండి"

# వచ్చుచున్నది



# ముగ్గురు కొడుకులు




.. జెమినీ చిత్రము ..

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 44
సంచిక 46
**23-7-52**

నందన శ్రావణ శుద్ధ విదియ బుధవారము


వ్యాఖ్యలు; విమర్శలు :

# మద్రాసురాష్ట్రంలో ప్రాజెక్టులు

మద్రాసు శాసనసభలో బడ్జెట్ చర్చల సందర్భంలో ప్రాజెక్టుల నిర్మాణం గురించి మంత్రివర్గ అభిప్రాయాన్ని మంత్రి రంగారెడ్డిగారు వివరించారు. ఇప్పట్లో కొత్త ప్రాజెక్టుల్ని గురించి ఇంజనీర్ల పరిశోధన జరగదనీ, ప్రారంభించిన ప్రాజెక్టుల్ని పూర్తి చెయ్యడంవరకే ఇప్పటికి జరుగుతుందనీ చెప్పారు. కృష్ణా-పెన్నా ప్రాజెక్టు విషయంలో ఖోస్లాకమిటీ నివేదికకోసం ప్రభుత్వం నిరీక్షిస్తున్నదని చెప్పారు.

ఈ ప్రకటనతో కొన్ని ముఖ్యమైన ప్రశ్నలుత్పన్నమౌతున్నాయి. కృష్ణా-పెన్నా ప్రాజెక్టుని ఖోస్లాకమిటీ తోసిపుచ్చినట్లయితే ఏంజరుగుతుంది? నందికొండ, పులిచింతలవంటి ప్రాజెక్టులు కృష్ణా-పెన్నా ప్రాజెక్టుకంటె ముఖ్యమనిగాని, కృష్ణా-పెన్నా ప్రాజెక్టునే సవరణ చెయ్యాలనిగాని ఖోస్లాకమిటీ సూచించినట్లయితే, కృష్ణా-పెన్నా ప్రాజెక్టుతోపాటు మిగిలిన సూచనల్ని 'కొత్తస్కీములు' కింద జమకట్టి మద్రాసుప్రభుత్వం నిలిపివేస్తుందా? ఈ అంశాన్ని మద్రాసు ప్రభుత్వం స్పష్టపరచవలసిన అవసరం ఉంది.

శాసన సభల్లోని సభ్యుల ప్రసంగాల్ని పరిశీలించినట్లయితే, కృష్ణా-పెన్నా ప్రాజెక్టుపట్ల మంత్రివర్గానికున్న శ్రద్ధ ఏ పార్టీ సభ్యులకూ లేదనీ, సంశయాలకూ, ఆవేశాలకూ హేతువైన కృష్ణానదీప్రాజెక్టుల విషయమై ధైర్యంగా స్పష్టంగా అవునని కాని కాదనిగాని తెలుగు సభ్యులెవ్వరూ చెప్పలేకపోతున్నారనీ స్పష్టమౌతున్నది. ఈ పరిస్థితిలో ఆంధ్రదేశపు ప్రజలను, తృప్తిపరచడానికీ, సంశయాలను నివృత్తి చేయడానికీ యత్నించడం మద్రాసు ప్రభుత్వ కర్తవ్యం. అలా తృప్తిపరచగలిగినప్పుడే ప్రజల సహకారం ప్రభుత్వ కార్యక్రమాలకు లభిస్తుంది. ప్రాజెక్టుల విషయమై ప్రజలకు ప్రభుత్వంపట్ల సంశయాలు నివృత్తి కాకుంటే, ఇతర ప్రభుత్వ కార్యక్రమాలపట్ల కూడా - అవి ప్రజల శ్రేయస్సుకోసమే ఉద్దేశించబడినప్పటికీ - ప్రజలు సహకారాన్నివ్వడానికి వెనుకాడగల అవకాశముంది. అప్పుడు ఆంధ్రుల్ని నిందించి ప్రయోజనం ఉండదు.

ప్రాజెక్టుల విషయంలో ఆవేశాలు పెంచరాదని ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు విజ్ఞప్తిచేశారు. దేశపరిస్థితుల్ని రాజకీయ వ్యవహారాలను ఇతరులకంటె సూక్ష్మంగా గ్రహించగల రాజాజీ చేసిన ఈ విజ్ఞప్తిని ఆంధ్రదేశనాయకులు గమనించడం ఇప్పుడు ముఖ్యం. ఆవేశాలు ఇదివరలో పెంపొందినాయంటే అది కారణరహితంగా సంభవించలేదని గ్రహించడానికి రాజాజీకి కష్టంకాదు. ఆవేశాలను పెంచుకోరాదని ఇప్పుడు విజ్ఞప్తిచేస్తున్నారంటే, ఈ ఆవేశాలకుగల మూలహేతువులను నివారించే బాధ్యత వారిపైనే వేసుకుంటున్నారన్నమాట. ఖోస్లాకమిటీ నివేదిక ప్లానింగ్ కమిషన్ కూ మద్రాసుప్రభు

## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
బొంబే టాకీస్ వారి "మా" చిత్రంలో అభినేత్రి శ్యామ

| | |
|---|---|
| వ్యాఖ్యలు విమర్శలు | 2 |
| వరహీనం—శ్రీ భమిడిపాటి జగన్నాథరావు | 4 |
| ముష్టిసన్మానం—శ్రీ డి. కె. ప్రసాదశాస్త్రి | 8 |
| అయాచిత సత్కారం—శ్రీ బసిరెడ్డి ఈశ్వరరెడ్డి | 11 |
| చదరంగం—శ్రీ రుద్రపాటి శామ్యూల్ జాన్ | 14 |
| బొమ్మరిల్లు— | 28 |
| సినిమా— | 40 |
| ప్రశ్నలు-సమాధానాలు | 46 |

త్వానికీ అందినతరువాత మద్రాసు ప్రభుత్వం అవలంబించగల వైఖరిపైనే ప్రభుత్వానికీ ఆంధ్రదేశ ప్రజానీకానికీ మధ్యగల వ్యవహారవిధానం ఆధారపడి ఉంటుంది.

## ఆంధ్రరాష్ట్రం:

ఆంధ్రరాష్ట్రం గురించి నాయకుల అభిప్రాయాలలో ఇటీవల చాల మార్పులు అగపడుతున్నాయి. రాష్ట్రవిభజనగురించి ఇంతవరకూ మద్రాసు శాసనసభ రెండు మార్లు, సముఖంగా తీర్మానాలు చేసింది. ఈమారు తీర్మానం ప్రవేశపెట్టబడినట్లయితే మద్రాసుశాసనసభ ఆమోదించే అవకాశం కనపడదు. పార్లమెంటులో భాషారాష్ట్రాలన్నిటికీ వర్తిల్లగల తీర్మానాన్ని కాంగ్రెస్ పార్టీ ఓడించింది కాని కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లో ఆంధ్రరాష్ట్రం గురించి శ్రీ పైడా వెంకటనారాయణగారు ప్రవేశపెట్టిన తీర్మానానికికూడా అదే గతి పట్టగలదని స్పష్టమౌతూనే వుంది. మద్రాసు శాసనసభలో ఆంధ్రరాష్ట్ర తీర్మానం ప్రవేశపెట్టితే ప్రతిఘటించడానికి మంత్రివర్గం నిర్ణయించినట్లు తెలుస్తున్నది. పార్లమెంటులోనూ కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లోనూ, ఇటీవల మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోనూ సభ్యుల ప్రసంగాలను గమనించినట్లయితే కొన్ని చిత్రమైన అంశాలు గోచరిస్తాయి.

భాషారాష్ట్రవిభజనే కాదు ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకూడా పనికిరాదని ఇదివరలో స్పష్టంగా చెప్పడానికి జంకిన వారికిప్పుడా జంకు పోయింది. హైదరాబాద్ విభజన అసలు తలపెట్టనే కూడదనే భావాన్ని చాలమంది (ఆంధ్రులు తప్ప) స్పష్టంగా ప్రకటిస్తున్నారు. రజాకార్ల హయాంనాటికీ, ఇప్పటికీ ఈసభ్యుల అభిప్రాయాలు తారుమారైనాయి. తమిళనాడులో నివసిస్తున్న ఒక ఆంధ్రుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం దక్షిణాది ఆంధ్రులకు క్షేమం కాదని సూచించాడు. తక్షణం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలని మొన్నమొన్నటివరకూ వాదించిన ఆంధ్రనాయకులు కొందరు ఏడాది గడువుపెట్టడం మొదలుపెట్టారు. కొందరు తమిళసభ్యులకు ఆంధ్రులు ఒక ముప్పుగా గోచరించారు.

భాషారాష్ట్ర నిర్మాణవిధానాన్ని నిరసించిన కొందరు తమిళసభ్యులు మద్రాసు నగరాన్ని ఆంధ్రులు వొదులుకుంటే ఆంధ్రరాష్ట్రం వెంటనే విడిపోవచ్చునన్నారు. అంటే ఆంధ్రులు మద్రాసును వొదులుకుంటే, భాషారాష్ట్ర నిర్మాణవిధానంపట్ల నిరసన దానంతటదే మాయమౌతుందన్న మాట.

సమయమూ సందర్భమూ చూసి రాష్ట్రవిభజన జరపాలని రాజాజీ తమ అభిప్రాయాన్ని మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్లో సలహా ఇచ్చారు. అయితే ఆంధ్రదేశ ప్రజల రాష్ట్రవాంఛను కొందరు పార్టీ రాజకీయాల ప్రయోజనాలకు ఒక అస్త్రంగా ప్రయోగించబూనడం చూసి చింత ప్రకటించారు.

ఆంధ్రరాష్ట్ర ఉద్యమగతిని పరిశీలించినట్లయితే రాజాజీ వెలిబుచ్చిన చింతలో అర్థమున్నదని ఆంధ్రులు కూడా అంగీకరిస్తారు. అయితే ఆంధ్రుల రాష్ట్రవాంఛను పార్టీలే కాదు తమిళులు కూడా ప్రబలమైన అస్త్రంగా ప్రయోగించి ఇంతవరకూ చెన్నపట్నంలోని ఆంధ్రులకు అన్యాయం చేసినారన్న విషయాన్ని రాజాజీ గ్రహించలేదు. ప్రాజెక్టుల విషయంలో ఆవేశాలు కూడదన్న రాజాజీ, రాష్ట్రపరిపాలనలో ఇట్టి లోపాలను సవరించగలిగితే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఎట్టి ఆవేశాలకూ ఉత్తరోత్తరా కక్షలకూ లోనుగాకుండా ఒనగూడుతుంది.

ఈ విషయంలో రాజాజీ నెరవేర్చగల సామరస్యసాధన కర్తవ్యం ఎంతైనా ఉంది. ఈ విషయాలన్నిటినీ శాసనసభలోని తెలుగు కాంగ్రెస్ సభ్యులు రాజాజీ దృష్టికి తేవడం అవసరం.

## మద్యనిషేధం

మద్యనిషేధం గురించి మద్రాసు శాసనసభలో ప్రతికూలపక్షనాయకుడు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ప్రతిపాదించిన ఖర్చుతగ్గింపు తీర్మానం వీగిపోయింది. మద్యనిషేధాన్ని ఉంచాలో మానాలో అనే విషయాన్ని పరిశీలించడం వల్ల అసలు కార్యక్రమానికే ముప్పు రాగలదని రాజాజీ అన్నారు. మద్యనిషేధాన్ని లాభనష్టాలతో తూచకుండా అత్యవసర కార్యక్రమంగా, ప్రజలపట్ల ప్రధాన కర్తవ్యంగా విశ్వసించి కాంగ్రెస్ అమలు జరిపింది. చాటుమాటున శాసనాన్ని ధిక్కరించేవారు ఏ కొందరో ఉన్నప్పటికీ, సామాన్యంగా అందరికీ ప్రయోజనకారి కాగలిగినప్పుడు శాసనాన్ని అమలు జరపాలా జరపకూడదా అనే సంశయం అనవసరం. మద్యనిషేధం వల్ల ప్రజల కుపకారం కలిగిందో లేదో తెలుసుకోవాలంటే కార్మికకర్షకుల కుటుంబాల వారినడిగితే తెలుస్తుంది. [18-7-52]

# పరిహాసం

ఈజీఛైర్ లో పడుక్కుని "టాగూర్" మహాశయుని "హోమ్ కమింగ్" అనే కథను చదువుతున్నాను. 14 సంవత్సరముల వయస్సుగల బాలుని మన సత్యం కవి మహర్షి "టాగూర్" రూపిస్తోంటే, ఇంత సూక్ష్మవివరాలను గూడ పరిశీలించి, అంత హృద్యంగా రచించిన రవీంద్ర కవీంద్రుని రచనాచమత్కృతిని, భావ పరిశీలనని ఊహించి ఎంత ఆనందించినా, వెనువెంటనే అసూయకూడ కల్గింది నాకు. నేనూ నా స్కూల్ ఫైనల్ రోజుల్లో, ఆ వయస్సులోనే ఆ విధంగానే ప్రవర్తించానుగా అన్న ఊహ నా అసూయకు తావిచ్చింది. కాని ఇప్పుడు పరిస్థితి దాటింది. స్కూల్ ఫైనల్ ఒక ఏడు డింకీకొట్టడంతో అప్పుడే మూడేళ్ళపైన దాటింది. ఆ వయస్సు గడచి.

ఇంతలో గదిగుమ్మం దగ్గర గాజుల గలగల శబ్దం, ఆలోచన కంతరాయం కల్గించింది. తలెత్తి చూసేను ఎవరో కొత్త అమ్మాయి ముఖంమాత్రం కనపడ్తూంది. అప్రయత్నంగా ఇద్దరికళ్ళు కలుసుకొన్నాయి వెంటనే, ఆ అమ్మాయి సిగ్గుతో పక్కగా నిలబడింది. నేను అక్కడ వుండడం మూలాన్న లోపలికి రావడానికి సంశయిస్తోందని నాకు తట్టింది.

ఇంతలో మా వదిన నా గదిలోకొచ్చి, ఆ అమ్మాయిని చూసి, చిరునవ్వుతో, "రావమ్మా, అంత సిగ్గుపడతావేమిటి? ఇంట్లో మగవాళ్ళెవరూ లేరులే! మామగారు వూళ్ళోలేరు, ఆయనేమో షికారు వెళ్లారు" అంది.

నాకు మా చెడ్డ తిక్కెత్తుకొచ్చింది. చెట్టంత మనిషిని కుర్చీలో కూర్చునివుంటే పరాయిమనిషితో మగవాళ్ళెవరూ లేరంటుం దేమిటి! పైగా నన్నా అమ్మాయి చూసింది గూడాను. ఇంట్లో మగవాళ్ళంటే మా వదిన దృష్టిలో మామగారు, అన్నయ్యే కాబోలు కనబడుతూంట" అనుకుంటూ కోపం ఇలా దిగమింగుకుంటూ అలానే కూర్చున్నా.

ఇలా అందో లేదో మా వదిన, ఆమె మాటే వేదవాక్యం అయినట్టు, కుర్చీలో చెట్టంత మనిషిని వుండడం చూసి గూడా, నన్నేదో అచేతన పదార్థంగా భావించినట్టుగా ఆ కొత్తఅమ్మాయి ఠీవిగా అంగ లేసుకుంటూ, మధ్యమధ్య చీర సర్దుకుంటూ వదినతో లోపలికి వెళ్ళింది వదిన మాటలోక ఎత్తుగాను, ఆ మాటలు పట్టుకొని చేతికొక్కంత అన్నట్టుగా నా ముందు నించిపోయిన ఆ అమ్మాయిప్రవర్తన దానికి పదింతలుగాను నన్ను గాయపరిచాయి. పైగా, ముందు నన్ను చూసినప్పటి సిగ్గు, జంకు కూడా మాయమయిపోయాయామెలో. పోనీ నా కంటె వయస్సులోనైనా అధికురాలా అంటే అదీగాదు. ఏదో కొత్తగా కొన్న బెంగుళూరు సిల్కుచీర లాంటిది ఆ వంటిమీద చూసేవాళ్ళకి కొత్త సదరుగా కట్టుకుందిగాని, ఆమె వయస్సునా లెక్కప్రకారం, అధిక మాసాల్తో వేసుకొన్నా, ఇరవై సంవత్సరాలు లోపే కాని ఎక్కువుండవు నా వయస్సు దాదాపు అంతేగా, మరింకేం జూసుకొని ఆ తెగ నీల్గుడు అని నాకు పట్టుకొంది.

పోనీ మన కెందుకు బయటికి పోదామని, అద్దం చూసుకొని తల దువ్వుకుంటున్నా, స్పష్టంగా అద్దంలో కనపడ్తూంది, మొన్ననే కత్తిరించిన సామీసకట్టు. మరి ఇంతలా మీసకట్టూ, అదీ, అమరుంటే ఏమిటో వాళ్ళ ప్రవర్తన అర్థంకాలా! ఆలోచిస్తూ వీధిలో నడుస్తున్నాను. ఎవరో వెనకనించి భుజం పట్టు కులాగితే, ఆశ్చర్యంతో వెనక్కి తిరిగేను. ఆయనెవరో తలంతా ముగ్గుబుట్టలావుంది. నాకేసి చూసి, "నువ్వు సత్యనారాయణగారి మూడోఅబ్బాయివి గాదుటోయ్" అన్నాడు "అవునండి" అన్నా. అలాగే అనుకున్నాలే. చిన్నప్పుడు చూశాను నిన్ను. నిన్ను అప్పుడంతా "చిన్నాడు" అని పిల్చేవారోయ్" అని ఆగాడు. "కాదండి, ఇప్పుడా పేరు కాదు. పేరు మారింది, నేను మూర్తిని" అని నిష్కర్షగా ఆయనేమనుకున్నా అనేద్దామనుకుంటూండగానే, ఆయన నామాట పైకి రాకుండానే, అందుకుని, "నువ్వు ఏమీ మారలేదోయ్ చిన్నప్పటిలానే వున్నావ్. మీ నాన్నగారిని కలుసుకోలేకపోయాను, ఏమీ అనుకోవద్దని చెప్పు" అంటూ సాగిపోయాడాయన.

ఈయన నోరు విప్పుతోనే చిన్నవాడనేమాట తప్ప ఇంకొకటి మాట్లాడ లేమిటిరా భగవంతుడా అనుకున్నా, పైగా చిన్నప్పటిమాటెందుకీయనికి? ఇప్పటి వేషం చూసి మాట్లాడాలిగాని, అనుకుంటూ ఓ సేఫ్టీరేజర్ కొందామని ఫాన్సీ షాపులోకి పోయా. అకస్మాత్తుగా మా

ఇంగ్లీషు లెక్చరర్ కనపడ్డాడు. ఇష్టం లేకపోయినా ఓ నమస్కారం పారేసి నమ్రతతో నించున్నా. ఆయనైనా నమస్కారం గూడా పెట్టేననైనా ఊరుకోవచ్చా! అలాగాకుండా, "ఏమిటోయ్, నువ్వంత పాడుచేశావు మొన్న పేపరు? మీ అన్నయ్యచదివేటప్పుడు. ఇలాగే రాశేవాడా? చిన్నవాడివిగనుక చెప్తున్నా, యీ యింటర్ మీడియేటే నోయ్ మీ *Future decide* చేసేది" అంటూ మధ్యలో ఇంగ్లీషు ముక్కలు చెరిగి మధ్య మధ్య మా అన్నయ్య రాసే శైలి, విధానం విపులంగా విశదీకరిస్తూ, మొత్తం మీద నువ్వో చవటవని తేల్చేడు. అలా సూటిగా అన్నా బావుండును. కాని మా అన్నయ్యతో కలపడమేమిటి నన్ను, నాకు వేరే అస్తిత్వం లేనట్టు? ఈ వేళ లేచిన వేళమంచిది కాదనుకుంటూ షాప్ యజమాని 'ఏం కావాలండీ' అంటున్నా వినిపించుకోకుండా బయటపడ్డాను ఆ ఉక్కిరిబిక్కిరిలోనుండి.

ఇలా తిరుగుతూవుంటే ఇంకా ఎంతమంది ఏమంటారో అని ఇంటిదారి పుచ్చుకున్నా. ఇంటికొచ్చి ఈవిషయమే ఆలోచిస్తున్నా. ఎప్పుడు చీకటిపడిందో కాని వదిన నాగదిలోకొచ్చి దీపం పెట్టి వెళ్ళిపోతోంది. "ఏవమ్మా, ఇందాకవచ్చిన అమ్మాయి ఎవరు" అన్నా. "ఏం" అంది వోరగా వెకిలిగాచూస్తూ నీకెందుకు అన్నట్టు. "ఆ, ఊరికే లే, ఎన్నేళ్లుంటాయేమిటి" అన్నా నాకంటె ఏమాత్రం పెద్దదో తెలిసికుందామని.

"కొంపదీసి పెళ్లిచేసుకుందా మనుకుంటున్నావేమిటి? వరహీనమవుతుంది గూడాను" అంది ఆవిడ. "వరహీన మేమిటమ్మా. నాకన్న పెద్దదా ఏమిటి?" అన్నా. ఆ అమ్మాయికంటె చిన్నవాడవని నన్ను అనడంచేత ఇలా అడిగేశాను.

"కొంపదీశావు. నిజంగా పెళ్లిజేసు



కుర్చీలో చెట్టంతమనిషిని వుండడంచూసిగూడా, నన్నేదో అచేతనపదార్థంగా భావించి ఆ కొత్త అమ్మాయి ఠీవిగా......

కొండా మనుకుంటున్నా వేమిటి ? ఈపాటికే ప్రేమించివుంటే జీవితమంతా విరహతాపంలో గడపాలోయ్ బాబు! ఆ అమ్మాయికి పెళ్ళయిపోయింది. వాళ్ళాయన్ని చూపిస్తానుండు. ఈ వీధిలోనే వాళ్ళుంటున్నది." అంటూ నవ్వుతూ వెళ్ళిపోయింది. ఇంతకీ నేను ఆమె వయస్సడిగి నాకంటె ఏమాత్రం పెద్దదో తెలిసికొండామని మాటవరస కడిగితే, ఇలా పెళ్లితో ముడిపెడుతుందేమి టీవిడ ? కథంతా అడ్డం తిరిగింది అనుకుంటూ, "నిజంగా చెప్పవమ్మా ఎన్నేళ్ళుంటాయి" అన్నా ఆమె దగ్గిరగా వెళ్లి.

"నాకు సరిగ్గా తెలియదుగాని, 18 ఏళ్లు వుంటాయి షుమారుగా" అంది.

ఓస్. ఇంతేనా, నా వయస్సుకూడా అంతేగా! మరి నాకంటె ఏమెక్కువని ఆ అమ్మాయికౌదర్పం ? ఒక్క పెళ్లి మాత్రం అయింది నాకంటె ఎక్కువగా! పోనీ నేనూ చేసుకుంటాను, ఈ బాధ తప్పుతుందేమో. ఛీ! అయినా ఇప్పుడే పెళ్లేమిటి, అని అనుకుంటూండగా, "సత్యనారాయణగారున్నారాండీ"అని పైనించి ఎవరో పిల్చారు. గబగబా వెళ్లి చూశాను ఎవరా అని. రోల్డ్ గోల్డ్ ఫ్రేమ్ కళ్లద్దాలు, జరీఅంచు ఖండువాతో ఎవరో కొత్తాయన నించునివున్నాడు. "రండి లోపలికి రండి" అని ఆహ్వానించాను. ఇద్దరం తాపీగా కూర్చున్నాము.

"మీ నాన్నగారు లేరనుకుంటా. వారితో మాట్లాడవలసిన పనుంది లెండి" అన్నా డాయన. "అవునండి, వూరు వెళ్ళారు. ఇవాళ రావచ్చు. మీరేమైనా చెప్పదలిస్తే నాతో చెప్పండి, నేను వారి అబ్బాయినే లెండి" అన్నా.

"అబ్బే, ఏమీ లేదోయ్. మా తమ్ముడు గారి పిల్లొకత్తివుంది. దానికి పెళ్ళిచేయాలనుకుంటున్నాం. పెళ్లికొడుకువి నిన్ను చూశానుగా! తక్కిన విషయాలు మీ నాన్నగారితో మాట్లాడుతాలే" అంటూ వెళ్లిపోయాడు. ఎంతమంది చెప్పినా ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకోకూడదు అనుకున్నా. ఇంతలో మా నాన్న, అమ్మ వూరినుంచి వచ్చారు. లోపలికి తీసికెళ్తూ అమ్మతో నవ్వుతూ చెప్తోంది వదినేదో.

## 2

రెండోరోజున కాలేజీనుండి ఇంటికొచ్చి భోజనానికి కూర్చున్నాను.

"బొట్టుపెట్టుకోవోయ్" అంది వదిన.

"ఎందుకు బొట్టు, నా కలవాటులేదుగా అన్నా."

"అందుకే అలవాటు చేసికోమంటున్నా పెళ్ళికూడా కాబోతోంది." అంది ఆవిడ.

"పెళ్లేమిటి ?" అన్నా తలెత్తి.

"అబ్బా, ఏమీ తెలియదండి అబ్బాయిగారికి. నిన్న మనింటికొచ్చినాయన తమ్ముడిపిల్లనే నీకిస్తారుట. ఇప్పుడే అయన మాట్లాడివెళ్ళాడు. రేపే పిల్లని చూడ్డానికి వెళ్ళేది" అంటూ వదిన నేతిగిన్నెలో నెయ్యంతా విస్తట్లో గుమ్మరించి నవ్వుతూ నిల్చొంది.

పోనీతే, ఇదీ బాగానే వుంది. పెళ్లికొడుకులా పోజు వేసి కూచున్నంతకాలం మనకీ హోదా, దర్జా వస్తాయి. పోనీ అంతగావస్తే పిల్లని చూసి, నచ్చలేదని చెప్పేద్దామని నిశ్చయించుకొన్నా.

పెళ్లికూతురిని చూడడానికి వెళ్ళాం. మేము కూర్చున్న గది రమ్యంగా అలంకరించబడివుంది. ఉక్కగా లేకపోయినా జేబురుమాలుతో విసురుకుంటూ కూర్చున్నా. ఇంతలో ఘల్లుఘల్లున అందెల చప్పుడు మందంగా, శ్రావ్యంగా విన

వచ్చింది. ఎంత చక్కగా వుందా శబ్దం! మృదువుగా నేలను తాకించి వినేవారికి విచిత్రానుభూతిని కల్గించేటట్టుగా నడిచే ఆ పాదాలు ఎంత సున్నితంగా వుండాలి! ఆలోచన మాని, తలెత్తిచూసి, ఆ పాదాల శబ్దం, అందెల రవళులు పెళ్లికూతురువేనని గ్రహించి ఆశ్చర్యపడ్డాను. ఎన్నాళ్ళు నేర్చుకుంటే అంత నేర్పుగా హృద్యంగా పదవిన్యాసం అలవడుతుంది! మెల్లిగావచ్చి చీరబుట్టలా పరుచుకొనేటట్టుగాకూచుంది. గంపెడు గులాబీపూలు, రంగుల బుట్టలో పోసి ఎదురుగా పెట్టినట్టయింది. ఎంత చక్కగా కూర్చుంది, చీర నలగకుండా, అంచులు కనబడుతూను! చిన్న నోరు, పొందికయిన పెదవులు, చిన్న కళ్లు వుంటే ముఖానికి అందంగా అమరుతాయన్న విషయం ఆమెను చూసిన తర్వాత గ్రహించాను.

అంతదీక్షగా ఆమె నలా చూడడం భావ్యం కాదేమో ననిపించింది. చూపు మరల్చి, గోడలు, గోడలకున్న జపాను పనితల బొమ్మలు, గడియారంలో తిరుగుతున్న ముళ్ళు చూస్తూ కొంతకాలం గడిపా. అలా ఎంతసేపో చూడలేక, మెల్లిగా కళ్ళు దించా కిందకు. దొంగ! వోరగా నన్నో కంటితో చూస్తూ నేను చూడగానే తల దించేసింది. ఎంత నేర్పుగా చూసింది! మళ్ళా ఇంకొక్కసారి చూస్తే ఎంత బావుండును! ఇద్దరి కళ్లు కలిసినప్పుడు, ఆమె ఎడం కంట్లో చిన్న పుట్టుమచ్చ వుండడం చూశా.

"ఓ పాట పాడమ్మాయి" అని ఎవరో అన్నారు. పాడడం ప్రారంభించింది. అబ్బ! ఆ చిన్ని నోరు, ఆ రెండు పెదవులు ఎంత నాజూకుగా ఉన్నాయి! కొంతమంది పాట మొదలుపెడుతూ కక్కడానికా అన్నట్టు నోరు తెరుస్తారు. అప్పుడే విడిచిన తెల్లగులాబీమొగ్గలా వుందామె నోరు. మృదుమధురస్వనాలు, ఆమె కంఠం నుండివస్తున్నయ్. పాట ఆపడంలోకూడా సొగసు కనబరిచింది ఆమె. "ఇంక లోపలికి తీసికెళ్ళండమ్మా" అని ఆ అమ్మాయి నాన్నగారన్నారు. ఇప్పుడు చూశా నామె పూర్తి వాలుజడ. ఆ జడ ఆమె ముందుకు వేసికొనివుండగా, ఆ జడ చివరలు, నా వేళ్ళతో సవిరిస్తే ఎంత బావుండును, అనిపించింది. "రారా, పోదాం" అని నాన్న తట్టిలేపారు. ఇంటికిపోయాం. పెళ్ళి చేసుకోకుండా వుందామన్న పట్టుదలశక్తి సడలిపోయింది చెప్పొద్దూ, వచ్చిచెడి, ఓ పద్యం కూడా కట్టే నామె మీద.

"పిల్ల ఎలా వుందోయ్" అని మా వదిన అడిగింది. "పిల్ల బావుంది కాని, ఓ కంట్లో పుట్టుమచ్చ వుంది" అని ఎవరో ఇంకా ఏదో చెప్పబోతున్నారు. ఆ అంటూన్న వాళ్ళ మిగిలిన మాటలు వినిపించుకోకుండానే, "ఆ పుట్టుమచ్చే ముఖానికి మరింత శోభనిచ్చింది. పైగా అదృష్టం కూడాను పుట్టుమచ్చ వుండడం" అని అప్రయత్నంగా అనేశాను. "ఇంకేం! పిల్ల నచ్చిందన్నమాటే! అయితే మా తోటికోడలు వస్తుందన్నమాటే. నాలుగైదు రోజుల్లో వారి దగ్గరనుండి శుభలేఖ వస్తుందిలే" అని వదిన అంటూంటే తల దువ్వుకుంటూ మీసమొకమాటు పరీక్షగా చూసుకున్నా.

* * *

(48-వ పేజీ చూడండి)

# ముష్టి సన్మానం

డి. కె. ప్రసాదశాస్త్రి

హోటలుబిల్లు చెల్లించి, బైట గుమ్మంలో అడుగుపెట్టేనో లేదో, పది పదిహేనుగురు ముష్టివాళ్లు నామీద ఒక్కసారిగా దాడిచేశారు. వాళ్లను తప్పించుకొని, నాలుగడుగులు ముందుకు వేసేసరికి, ఒక విచిత్ర యాచకుడు అడ్డుతగిలేడు నాకు.

"బాబూ, సన్మానం! ఒక్క సన్మానం చేయించండి" అని దీనంగా యాచిస్తున్నాడు కాఫీహోటల్లోకి వస్తూపోతూన్న జనాన్ని. కాని, పాపం, అతని మొర ఎవరూ విన్నట్టే కనిపించదు. అవునుమరి, అసంఖ్యాకములైన ఆ కంఠధ్వనుల్లో ఒక అల్పమానవుని రోదనధ్వని ఏపాటిది?

నాకుమాత్రం చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ హోటలుకు వెళ్లడం అదే మొదటిసారి. అందుచేత యీ యాచన వింతగా కనిపించింది. మరి, తరచు ఆ చుట్టుపక్కల మసలే వ్యక్తులకుమాత్రం పాతసంగతేమో, తెలియదు తిండికి ముష్టెత్తేవాళ్ళను అందరూ ఎరుగుదురు. గుడ్డకోసం యాచించేవాళ్లు కూడా సామాన్యమే. అక్కడక్కడ సినీమాడబ్బులకోసంకూడా అర్థించడం కద్దు. కాని, ఆ రహస్యం పైకి వెల్లడికానీయరు. వీళ్ళకు మరొక మెట్టు పైన ఉన్నారు చేబదులు పుచ్చుకుని, ఎగకొట్టే ఘరానా యాచకులు. వీళ్ళను తలదన్నేరకం — క్షామాలలో సంభవించిన భూకంపానికి (నష్టంలేకపోయినాసరే, ఇబ్బందిలేదు!) మన వూళ్లో ముష్టెత్తే ప్రపంచసేవకులు. వీళ్ళకు బహుశా రాయలసీమలో నిత్యం విలయతాండవం చేస్తున్న క్షామదేవత సంగతి తెలిసివుండదు. యిత్యాదులను నిత్యమూ ఎంతోమందిని చూస్తూనే ఉన్నాము. కాని, సన్మానంకోసం యింత పబ్లిక్‌గా యాచించేవారినిమాత్రం నేనెన్నడూ చూడలేదు సరికదా, అటువంటివాళ్లున్నారని వినలేదుకూడాను. (పైగా పెట్టుగా శ్రాద్ధేయపడ్డవాళ్లున్నా, అది లోపాయికారీ విషయంలెండి!)

యింతకూ అసలు విషయం — ఏ హోదాతో ఆ వ్యక్తి సన్మానభిక్షాన్ని అర్థిస్తున్నాడో తెలుసుకుందామని కుతూహలం కలిగి దగ్గరికివెళ్ళేను. నేనూ తనవంటి ఒక యాచకుణ్ణే అనుకున్నాడుకాబోలు, ఆ ముష్టివాడు నన్ను జబ్బపట్టుకుని పక్కకులాగుతూ, "దారిలో లేవయ్యా, దానంచేసే ధర్మాత్ములు వస్తూపోతూంటారు" అన్నాడు. వెంటనే నేను మహాకోపంతో చెయ్యి విదిలించుకుని,

"ఎవర్ననుకుంటున్నావురా, ఫూల్! నేనేం ముష్టివాణ్ణనుకున్నావా?" అన్నాను, నలిగిపోయిన చొక్కామడతలను సరిచేసుకుంటూ.

వాడు కొంచం చిన్నబుచ్చుకున్నాడు. "బాబూ, యీరోజుల్లో, దాతలెవరో యాచకులెవరో బట్టలనుబట్టి పోల్చుకోలేం చూడండి" అన్నాడు.

కాళ్లు పట్టుకోకపోయినా, కనీసం క్షమార్పణైనా కోరుతాడనుకున్నాను కాని, అలాంటిదేం జరగలేదు సరికదా, పైగా మాటల్లోకూడా అహంభావం గోచరిస్తోంది. అయినా, ఆత్మగౌరవానికి లోపం ఎందుకు రావాలని, "సరేలే, యీసారికి క్షమించాను. యింతకూ, నువ్వు డబ్బు, దస్కం యాచించక, సన్మానంకోసం ముష్టెత్తుతున్నావు, ఏమిటి సంగతి?" అన్నాను ఠీవిగా నిలబడి. అప్పటికింకా సిగరెట్టు ముట్టించలేదు. లేకపోతే యింకా దర్జాగా నిలబడేవాణ్ణేమో!

యాచకుడు నన్ను నఖశిఖపర్యంతం ఒక్కసారి సవిమర్శనగా చూశాడు. ఆ గుంటలు పడ్డ కళ్లలో ఆశాభావం మెరుస్తోంది.

"అయ్యా, మీకెంతైనా పుణ్యముంటుంది, నాకొక సన్మానం చేయించండి" అన్నాడు, జేబులోంచి మసీదుమార్కు సిగరెట్టొతీసి, అగ్గిపెట్టె యిమ్మన్నట్లు సంజ్ఞ చేస్తూ.

"నీకు సన్మానం ఎందుకు చేయాలోయ్?" అని అడిగేను, దాతహోదాతో.

"ఎందు కేమిటండీ, నా పాండిత్యానికి." అన్నాడు.

పాండిత్యానికా? ఒక్కసారి ఆశ్చర్యపోయాను. విద్వత్తుకు అంత ఆదరణ లేకుండాపోయిందా? పరమ భాగవతోత్తముడు పోతన ఒక్కసారి నాకళ్లముందు మెరిసేడు. మానసికంగా చాలా విచారించాను. ఇతడెవరో కవి అయివుంటాడనుకున్నాను. అతని కవితాకన్యను ఆదరించేవారెవరూ లేకపోయారు కాబోలు, అనాథ అయిపోయింది. మరొకసారి ఆవింత యాచకుణ్ణి చూశాను. చిరిగి, మాసిపోయిన బట్టలు, పెరిగిన గడ్డం, తైలసంస్కారంలేని జీబురుజుట్టు, తెగిపోగా పునః మరమ్మత్తుకులోనైన పాదరక్షలు, వీటి నన్నింటిని మించి, వల్లెవాటుగా కప్పుకున్న పాతకండువా, నిజంగా అనాదరణకు లోనైన ఒక కవికుమారుడులాగే కనిపించాడు. దాంతో అతనంటే నాలో ఒక విధమైన గౌరవభావం నాకు తెలియకుండానే ఏర్పడింది. పూర్వకాలంలో అతడు కోరిన అగ్నిపేటికను యిప్పుడు అనుగ్రహిస్తూ, కొంచం మర్యాదగా,

"అయితే కవులన్నమాట!" అన్నాను.

అది అనువుగా తీసుకుని, ఆ మహానుభావుడు కొంచం రీవిగా నిలబడి, "అలా లోపలికి వెళ్లి మాట్లాడుకుందాం రండి" అని కాఫ్యాలయంకేసి చూపించాడు. ఏదో వింతగా ఉన్నది అతని సంగతి తెలుసుకుందామన్న కుతూహలంతో, అంగీకారసూచకంగా తల ఊపేను. నిజానికి, ఆనాడు ఆదివారం అవడంవల్ల నా కార్యక్రమం రెండు పేజీలైనా ఉంది. అయినా దాన్ని ఒక మూలపెట్టేసి, యీ గ్రంథంలోకి దిగేను, అంతరాత్మ వద్దంటున్నా వినక.

అతడే ముందు దారితీసేడు. ఆ వెనకాల నేను నడుస్తున్నాను. ఒక రిద్దరువ్యక్తులు మాకేసి వింతగా చూశారు. వాళ్ల కంటికి పురోగమిస్తున్న అతడు దాతగాను, అతన్ననుసరిస్తున్న నేను యాచకుడుగాను కనిపించామేమో! నిర్మానుష్యమైన ఒక మూలకు తీసుకువెళ్లేడా కవి. ఇద్దరం చెరొక కుర్చీమీద కూర్చున్నాం. నిజానికి నేనే దాత నవడంవల్ల అయ్యరును పిలిచి, ఒకకాఫీ తెమ్మన్నాను, వ్యవహారాన్ని తేలిగ్గా పోనిద్దామన్న ఉద్దేశ్యంతో.

వెంటనే ఆ వ్యక్తి "ముందు ఘనపదార్థం సేవిస్తేనేగాని ద్రవం తీసుకోరాదన్న నియమం ఉందండి నాకు. 'సీసం' తర్వాతనే 'గీతం' కదండీ!" అన్నాడు. యాచకులకుకూడా ఆహారంవిషయంలో నియమాలుంటాయని వినడం నాకదే మొదటిసారి ఈ ముష్టివాడేదో అసాధారణుడై

ఉంటాడనుకున్నాను. సరే అతని యీ నాతికరిననియమానికి భంగం ఎందుకు కలిగించాలని, ఘనపదార్థమైన ఇడ్లీకి ఆర్డరు యిచ్చాను. అవి రావడం, ఆహరించడం కూడా జరుగుతోంది.

"ఇంతకూ ఏవిద్యలో మీరు పండితులో చెప్పేరు కారు కవులా?" అన్నాను.

"ఉత్తకవినే అయివుంటే ఈ విచారమే లేకపోయేదేమో!" అన్నాడు దీర్ఘంగా నిట్టూరుస్తూ.

"అదెలాగ!" అన్నాను ఆశ్చర్యంతో.

రాసిన కవిత్వాన్ని అచ్చువేసి, ఆదరించే నాథుడు లేక టన్నుల కొలదీ వ్రాతప్రతులు ప్రతీ యేడు చెదలపాలవుతున్నట్టున్నా, తత్ఫలితంగా యీ కరువురోజుల్లో తెల్ల కాగితాలు దుర్వ్యయం అవుతున్నట్టున్నా ఎవరో బాధ్యతగల సర్కారేతర ఉద్యోగి ఎక్కడో అన్నట్టు విన్నాను. మరి, యీ మహానుభావుడు కేవలం కవి అయివుంటే, నిర్విచారంగా జీవితాన్ని గడిపివేసే వాణ్ణంటున్నాడు. సాధ్యమా అని నా అనుమానం.

నా అనుమానం వెంటనే నివృత్తికూడా అయింది అతని జవాబుతో. దాని సారాంశం యిది - ఈనాడు నూటికి తొంభై పత్రికల్లో కనిపించేది రెండో తరగతి కవిత్వమేనట. సన్మానాలు కూడా అధికారికే జరుగుతున్నాయట. మిగిలిన పత్రికల తాలూకు కవిత్వపదార్థమే మొత్తం మీద కొంచం నయమట. అయినా, అది కూడా గీటుకు ఆనదట ఎక్కడైనా గీటుకు వచ్చే కవిత్వమే దైనా బయలుదేరితే అది సామాన్య మానవులందరికీ కొరక బడక పోవడం చేత, తత్సృష్టికర్తలు అజ్ఞాతంగా ఉండిపోతున్నారట. తనుకూడా ఆతరగతి వాడేనట. ఇదీ ఆ మహాకవి యిచ్చిన ఉపన్యాస సారాంశం.

నేను మర్యాదకోసం ఆ ఆత్మస్తుతిని ఆమోదించి ఊరుకున్నాను. అతను తన ఉపన్యాసాన్ని యీవిధంగాముగించాడు.

"అసలు చిన్నప్పుడే మా మామ్మ అనేది నన్ను "ఒరేయి అబ్బిగా, నీలో మంచి పాండిత్యలక్షణాలున్నాయిరా" అని. ఆవిడ దృష్టికి ఏనాడో కీర్తిశేషుడైన ఆమె భర్త అంటే మా తాత నారూపంతో తిరిగి అవతరించాడని. ఆరోజుల్లో అది విని నేను నవ్విపారేశేవాణ్ణి. కాని, యీనాడు' ఆవిడ అన్నమాటల్లో ప్రత్యక్షరం నిజమేనని తోస్తూంది." అని. అప్పటికప్పుడే అయ్యరు మూడో పళ్ళెం అందిచ్చాడు. మరి పండితుడు ఎంత ఆకలిగా ఉన్నాడో కాని, అదికూడా చూస్తుండగా నే కళీఅయిపోయింది మరోపళ్ళేనికిపురమాయించాడు.

"అయితే, యింతవరకూ మీ పాండిత్యాన్ని గుర్తించేవారే లేకపోయారా? అని అడిగేను."

"యిప్పుడు నా అదృష్టంవల్ల మీరు కనిపించారుగా. నిజంగా దేవుడే నా మొరవిని మిమ్మల్ని పంపించాడని భావిస్తున్నాను." అన్నాడు జాలిగా.

నేను కొంచం జంకేను. యీ మహాకవి తన సన్మానమహోత్సవం నా చేతుల మీదుగానే జరిపించుకొంటాడేమోనని. అంతవరకు వస్తే, ఏదో వంకతో తప్పుకోలేక పోతానా అని నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను, అయినా నేనేం మాట యివ్వలేదుగా ఆ విషయంలో.

కుతూహలంకొద్దీ, "గ్రంథాలేమైనా రాశారా?" అన్నాను.




"నీకు సన్మానం ఎందుకు చేయాలోయ్?" అన్నాను.




"గ్రంథాలు రాసే అవకాశమే ఉంటే, ఏ పుస్తకాల దుకాణమో పెట్టుకోలేక పోయేవాణ్ణా; ఏ మిఠాయివారినో ఆశ్రయించి." అన్నాడు.

కవులెప్పుడూ యింతేలే! పరాధీనులు!

"పోనీ ఏ చిన్నకథలో భావగీతాలో రాసి పత్రికలకు పంపలేకపోయారా, కాఫీ ఖర్చుకైనా వచ్చేది?"

"పోనెద్దురూ, పాడుకథలూ, చచ్చు భావగీతాలూను! ప్రతీ ముష్టివాడి జీవితం ఒకకథే. వాడు ఆలాపించేవన్నీ భావగీతాలే. వాటికేమైనా నియమాలు కావాలా ఏమన్నానా? అథవా రాసినా, నూటికి తొంభైతొమ్మిది పత్రికాధిపతులు అచ్చు కాపీతో సంతుష్టి పొందమనేవారేగా. అది అమ్ముకుని తింటే కడుపు నిండనా, కాలునిండనా?" అన్నాడు నిస్పృహతో.

మనిషి కొంచెం సరుకున్నవాడిలాగే కనిపిస్తున్నాడు. యిక పళ్ళేలురాక అపు చేయించి, అయ్యరును యిక కాఫీ తెమ్మన్నాను. అతడు వెంటనే రెండని సరిదిద్దేడు. దాన్ని కొట్టిపారేస్తు, "నేను యిప్పుడే తీసుకున్నాను. నాకు అక్కర్లేగులెండి" అన్నాను నేను.

"పోనెండి. నేనే పుచ్చుకుంటాను. వృధాగా విడిచిపెట్టేస్తామా! మనదేం డబ్బా, మన్నా?" అన్నాడు బాధ్యత తెలిసినవాడికి మల్లే.

అప్పుడే ఉమ్మడిప్రయోగం ఆరంభించాడు పండితుడు. యిప్పటివాళ్ళకు కొంతమంది కున్న జబ్బే యిది. చోటిచ్చేవరకూ ప్రాధేయపడుతారు. తీరా దయతలచి చోటిస్తే, కాళ్లు బారజాపి పడుకుని, యింక లేవరు. మరి, అట్టివాళ్ళకు ఆదిర లెక్కణ్ణించి వస్తుంది చెప్పండి?

అయ్యరు కాఫీలతోపాటు, బిల్లుకూడా ప్రసాదించాడు, సాల గ్రామదానం విలువకి. అంతటితోనైనా పూర్తయిందని సంతోషించవలసి వచ్చింది, లేని తద్దినం తెచ్చిపెట్టుకున్నందుకు. అతిథి నాకన్న ముందుగానే వీధిలోకి నడిచాడు. వెనకాల, నేను బిల్లు చెల్లించివచ్చి అయన్ని కలుసుకున్నాను. అంతటితో ఆ సమావేశం ముగిద్దామని ముఖ్యంగా మూడుమాటల్లో అడిగేశాను "మీరు యింతకూ ఏ విద్యలో పండితులని." తెలుసుకుని ఉంటే ఎందుకైనా మంచిదని నాపిచ్చి ఊహ. డబ్బు ఖర్చైనా ఒక మహాపండితుని సహవాసమేనా దొరుకుతుందికదూ మరి!

అతను నవ్వుతూ, "నా మచ్చుగీతిక విలువ రూపాయి పావలా అని మీరూ, తెలుసుకున్నారను కుంటాను. మరో అది వారం మీయింట్లో మధ్యాహ్నానికి ఏర్పాటుచేస్తే నా పాండిత్యం మీకు బోధపడుతుంది." అన్నాడు.

నేను తెల్లబోయాను. అయితే యితగాడు తిండిలో నే మహాపండితుడన్నమాట! ఆ వెధవ పాండిత్యానికి బోడి సన్మానమొకటా? ఒక్కసారి ఆ చెంప యీ చెంప వాయిద్దామనుకున్నాను.

కాని, "నలుగురిలోనూనా? ముందు నా బతుకే అల్లరిపాలవుతుంది. కాఫీనీళ్లు పోయి 'స్నానని తీసుకువచ్చి, తీరా వాయించాక తంతావా?" అని పాడుసభ్యత అడ్డు వచ్చింది. నిజమే. యీ మోసానికి సాక్షులెవరూ లేరుగా.

నేను మరి జవాబు చెప్పకుండా రోడ్డు మీద పడ్డాను. అతను యింకా నా వెనకాలే వస్తూ, "వీలుగా ఉంటే, వచ్చే ఆదివారమే ఏర్పాటు చేయించండి. మీకు సావకాశం కూడా ఉంటుంది."

"ఏడిసినట్లే ఉంది. తిండిపోతుకుకూడా సన్మానమే?" అన్నాను వళ్లు మండిపోయి.

"అదేమిటండీ, తినడం పాండిత్యం కాదంటారా? ఏదీ, ఎవరైనా నాతో సమానంగా తిని, జీర్ణం చేసుకోమనండి, నా చెవు కదపాయిస్తాను" అన్నాడు సవాల్‌గా.

నా మనస్సు, "నిజమే్రోయ్" అంది.

కాని, నాలో నేను "భగవంతుడు కొంతమందికి కొన్ని విద్యల్లో పాండిత్యమిస్తే, వీడికి తినడంలో పాండిత్యంయిచ్చాడు" అని సంతుష్టితో, చరచరా ముందుకు సాగిపోయాను, మళ్ళామాట్లాడకుండా! అతను కూడా యిక నాతో లాభంలేదనుకుని కాబోలు, ఆగిపోయాడు.

పదిహేనురోజులదాకా, నేను తిరిగి అటువైపు వెళ్లలేదు, ఆ మహా పండితుని సన్మానసంఘాధ్యక్ష పదవి ఎక్కడ నామీద పడుతుందోనన్న భయంతో.

ఒకనాడు తప్పని సరిగా అటువైపు వెళ్ళవలసివచ్చింది. అప్పటికీ ఆ హోటలు గుమ్మానికి దూరంగానే నక్కుతూ వెడుతూంటే,

"బాబూ సన్మానం, ఒక్క సన్మానం చేయించండి" అన్నమాటలు వినిపించాయి. యింకా ఎవరూ సన్మానం చెయ్యలేదేమో ఆ మహాపండితుడికి. బడితపూజతోకాని వదలదేమో ఆ సన్మాన యాచన! ఎప్పటికైనా ఎవరైనా ప్రయత్నించి చూడక పోతారా? ప్రపంచంలో అందరూ నావంటి సానుభూతిపరులే వుంటారని హామీ ఏదీ?



# అయాచిత సత్కారం

శ్రీ బసిరెడ్డి ఈశ్వరరెడ్డి

రావుకీ నాకు నేస్తం యీనాటిదికాదు. వయస్సుగానీ కాలంగానీ మమ్ముల్ని వేరుచేయలేకపోయింది. యిద్దరికీ అక్షరాభ్యాసం ఒకే రోజే జరిగింది. ఒకేరోజే యిద్దరం హైస్కూల్లో అడుగుబెట్టాం. కానీ వాడు అంచెలూ మెట్లూ దాటేస్తూ బి. ఏ. బియల్ కి సాగిపోయాడు. నేనో మెట్రికుల్యేషను ముమ్మారు గుంజిమూసి యక లాభంలేక "కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా" అంటూ పొలం గట్రా చూసుకుంటూ ఊళ్ళోనే ఉన్నాను. కానీ ఏ అంతస్తులూ ఏ ప్రత్యేకపరిస్థితులూ మమ్మల్ని వేరుచేయలేవు. యీ విషయం ఊళ్ళో అందరికీ తెలుసు.

ఒకరోజు ఉదయం ప్రియురాలు లక్ష్మి యిరవై కోరికలతో నసుగుతూ యిచ్చిన కాఫీ పానీయాన్ని సేవించి కుర్చీలో కూలబడి పదిదినాలక్రిందటి న్యూస్ పేపరు చదువుతూన్నాను. యింతలోనే ఆకాశం నుంచి ఊడిపడ్డట్టుగా ఒక మహనీయుడు వచ్చి ఎదుటబడ్డాడు. ఆ జరీకండువా, సిల్కులాల్చీ, మెరిసే బూట్లూ మహా యిదిగా ఉన్నాడులే. నూటయాభై పౌన్ల శరీరం, మాట్లాడ్డానికే ఆయాసం, ఎన్నడూ ఎండ కన్నెరుగనివాడుగా ఉన్నాడు. అతడెవ్వడో తెలియనందున ప్రశ్నార్థకంగా చూచిన నన్ను చూస్తే అతనికి నవ్వొచ్చింది. నన్నే ఎరగవుట్రా శేఖరాన్ని. అప్పుడే మరచిపోయావా మన శర్తఘోరమూ నాయుడుగా రమ్మయ్యీ, అంటూ చెయ్యి జారుగా భుజంపై వేయగానే నా భుజస్కంధం ఊడిపోయినట్లయింది.

క్షణంలో చిన్ననాటి విషయాలన్నీ స్మృతిపటంపై తెరలు తెరలుగా అలుముకొన్నై. వాడూ నేనూ ఒకే స్కూల్లో చదువుకొన్నాం. ఒకే పక్కపై నిద్రించాం. చిన్నప్పుడు చాలా అల్లరిగా ఉండేవాడు. చక్క చిక్క ఉండేవాడు. మాస్టర్ల బొమ్మలను బోర్డుపై వేయడం, పిల్లకాయల వీపులను వినోదంకొరకు మోగించడం అమ్మాయిల జడలుబట్టుకొని లాగడం ఒకటేమిటి ఆనాటి మా పట్టణ చరిత్రలో వాడికి సంబంధంలేని తుంటరిపనే లేదు. మేమంతా వాణ్ణి "ఎండు చేప" అని పిలిచేవాళ్ళం. ఫోర్తుఫారంనుంచే మా యిద్దరికీ ఎడబాటు సంభవించింది. తరువాత వాడు జూదాలకూ విలాసాలకూ చాలాడబ్బు ఖర్చుపెట్టినట్లూ గిండీ హార్సు రేసెస్ లో ముప్ఫైవేలు ఒకేరోజున పోగొట్టుకొన్నట్లూ చివరకు జ్ఞానోదయమై మిగిలిన రెండువందల ఎకరాలతో శాంతంగా కాలం గడుపుతున్నట్లూ విన్నాను. కానీ చూడడమిదే మొదటిసారి.

ఇంతలోనే లోపలనుంచీ కాఫీ టిఫిన్ తయారైందని పిలుపువచ్చింది. వాడప్పుడే తినివచ్చానన్నాడు. ససేమిరా రానన్నాడు. "పోనీలే మాలాంటి పేదలయింట్లో మీరుతింటారా" అని నేను ఎత్తిపొడవగానే అమాంతం కుర్చీనుంచీ వంటింట్లోకి ఒకే గంతువేశాడు. సుష్టుగా తిని మరలా యథాస్థానాల నలంకరించాం. గతజీవితాన్నంతా నెమరువేసుకొన్నాం ... చింతతోపులో ప్రణయమూ, నాయుడుగా రమ్మయితో మంతనాలూ, బెడిసికొట్టడం దేహశుద్ధీ ఊర్లో ప్రఖ్యాతీ అన్నీ సింహావలోకనం చేసికొని నవ్వుకొన్నాం. వాడి ప్రస్తుత పరిస్థితినంతా ఏకరువు పెట్టాడు. తన యిద్దరు పిల్లలను గురించీ తన ఆదాయాన్ని గురించీ వివరిస్తూ హఠాత్తుగా సీరియస్ గా ముఖంపెట్టి నే 'నిప్పుడెందుకొచ్చానో తెలుసా' అన్నాడు. 'నా కెట్లా తెలుస్తుంది. 'జ్యోతిషం గూడా రాదే' అని నవ్వాను. కానీ వాడు నా నవ్వులో శృతికలపలేదు.

నే నెందుకొచ్చానో నీకు చెప్తే చాలా అసహ్యించుకొంటావనుకొంటానన్నాడు. అసలు విషయమేదో చెప్పరాదూ ఎందుకీ పీఠిక అన్నాను. ఇక వాడు ప్రారంభించాడు. వాడి మూడవ తమ్ముడు కృష్ణుడు ఏదో అల్లరి చిల్లరిగా రౌడీ పెద్దలందరినీ వెంటేసుకొని తిరుగుతూంటాడట. గ్రామంలో వాడిఅనుచరుల తాండవం చాలా ఘోరంగా ఉండేదట. ఎన్నోమార్లు చెప్పి చూచినా లాభంలేకపోయిందట. అవ్వూళ్ళో శూద్రవాళ్ళకూ మాదిగవాళ్ళకూ చాలాకాలంనుంచీ వైరమట. ఒకరోజున మాదిగవాళ్ళు పెళ్లి కున్నా యిమేళంతో ఊరంతా అట్టహాసంగా ఊరేగింపు జరుపుతూన్నారట. ఊరేగింపు గ్రామమధ్యంలోనికి రాగానే శూద్రవాళ్ళంతా మెరవణిపై బడ్డారట. ఫలితం, ఒక మాదిగవాడు చంపబడ్డాడట. ఈ మాట చెప్తూంటే అతని కళ్ళలో నీళ్ళు సుడులుతిరిగినై. గద్గదస్వరంతో చెప్పడం ప్రారంభించాడు.

కృష్ణుడిని జైల్లో పెట్టారు. ఆ రోజు వాడు ఊళ్ళోనే లేడు. కానీ ప్రాసిక్యూషన్ వాళ్ళు అతడే కారణమని ఆరోపించారు. ఇంకా నెలతిరగలేదు. అప్పుడే వాడు చిక్కి శల్యమయ్యాడు. బొత్తిగా అన్నం మానివేశాడు. వాడిపై 304 వ సెక్షన్ పెట్టారు. ఈ కేసు సెషన్సుకు కమిట్ అయితే తిరగడం అసంభవం. ఆ మేజిస్ట్రేటుకు 'నువ్వొక్కడివే, స్నేహితుడివి' అని వాడు నిలిపివేశాడు. జీవితమంతా క్రియాశూన్యమైన మాటల్లోనే గడిపిన వాకు సమయోచితంగా మాట్లాడడం చేతగాదు. "అయితే నే నిల్లాంటి విషయాల్లో జోక్యం చేసుకునేవాణ్ణి కాదే" అన్నాను. వాడి మనస్సు దెబ్బతిన్నది. బాబూ నువ్వలాంటివాడివి కాదు; ఆదర్శమైనవాడివి. నాకూ తెలుసు. కానీ వాడి జీవితాన్ని గమనించు. నా బాధను అర్థం చేస్కుకో. నా బ్రతుకులో నిన్నైనా ఎవరినైనా కోరే తుదికోరిక యిదొక్కటే అని

(38-వ పేజీ చూడుడు)

సీరియల్ నవల

# రెండు మహా నగరాలు

చార్లెస్ డికెన్స్

## 22

టెల్‌సన్సు బ్యాంకిగేటుముందు ముక్కాలిపీటమీద బైఠాయించి కూర్చున్న క్రంచర్‌కు దినదినం అనేక దృశ్యాలు కంటబడుతూ వుంటై. ఫ్లీట్ స్ట్రీట్ వెంట, తూర్పునుంచి పడమరకూ, పడమరనుంచి తూర్పుకూ ఎడతెగని ప్రవాహాలుగా ప్రజలూ బళ్ళూ జట్టా సాగిపోతూ వుంటై. ఒకనాడు, యిలాగే, క్రంచర్, గడ్డిపరకలు కొరుక్కుంటూ ముక్కాలిపీటమీద కూర్చునున్నాడు, రోడ్డుమీద పోయే ప్రవాహాలవంక చూస్తూ; అతని కొడుకు జర్రీ, జీబుతలా వాడూ, పక్కనే నిల్చునున్నాడు. అలా చూస్తూ వుండగా దూరాన్నుంచి యేదో ఉత్సవం వస్తున్నట్టు క్రంచర్ పరికించాడు. శవపేటికను ఊరేగిస్తూ భూస్థాపనకు చర్చికి తీసుకుపోతున్నారని తెలుసుకున్నాడు. ఆ శవోత్సవం జరగటం ప్రజాసమూహానికి యిష్టంలేక అడ్డుతగుల్తున్నారు. అందుచేత, అత్యంత కోలాహలంగా వుంది.

'ఒరేయ్ జర్రీ!' అన్నాడు క్రంచర్ కొడుకువంక చూసి 'ఏదో శవం వస్తావుందల్లే వుందిరా?'

'ఓరి బల్లే!' జర్రీ ఎగిరి గంతువేశాడు.

అలా ఎందుకు అరిచాడో జర్రీకే తెలీదు. ఆ గావుకేక విని క్రంచర్‌కు వళ్ళు మండింది. గూబ కురికి ఒక్కటి పుచ్చుకున్నాడు.

'ఏంటిరా బాడఖావ్—ఏందా కేకా.'

'నేనేం జేశానయ్యా!'

'జన్మలో మళ్లీ ఎన్నటికీ అట్టా కేక బెట్టమాక.'

కుర్రాడు తండ్రిమాట శిరసావహించాడు. ఇంతలోనే ఆ ఉత్సవందగ్గిరి కొచ్చింది. శవపేటిక వున్న బండిచుట్టూ చేరి జనం, కేకలూ, బొబ్బలూ పెట్టేస్తున్నారు. ఆ శవానికి సంబంధించిన ఒకే ఒక దుఃఖార్తుడు శవపేటిక ప్రక్కను బండిలో కూర్చునున్నాడు. సంతాపసూచకంగా అతను నెత్తికీ దండచేతులకు కట్టుకున్న నల్లగుడ్డపీలికల్ని జనం బడి పీకేస్తున్నారు. దోవనుబోయే జనమంతా ఆ కోలాహలంలో చేరి మరింత రభస పెరగటంతో అతని పని మరింత ఉక్కిరిబిక్కిరైపోయింది. 'గూఢచారులంట! రొండవనాయాళ్ళు!' ఈ వరసని సాగించి పోటుతిట్లన్నీ తిడుతూ జనం బండిమీదికి రొంగబడ్డారు.

అసలు మామూలుగానే, శవోత్సవాలంటే క్రంచర్‌కు సరదా; అలాంటివి రోడ్డువెంట వస్తున్నాయంటే ఉత్సాహంగా లేచి నిల్చుంటాడు. ఈవేళ మరీ యింత కోలాహలంగా యిలాటి శవోత్సవం రావటంతో అతనికి మరింత ఉల్లాసంగా వుంది. గబా గాను కూడా రోడ్డెక్కి ఒక మనిషిని అడ్డం తగిలి:

'ఏటోయ్ తమ్ముడూ; ఏటిదంతా?' అన్నాడు.

'ఏటో తెలీదు—గూఢచారులు! హా!—ఛూ!—గూఢచారులంట!'—

మరోడికి అడ్డంతగిలాడు: 'ఏటన్నా! ఎవుడూ!' వొళ్ళు తెలియని ఆవేశంలోవున్న ఆ రెండోమనిషి కూడా అదే సమాధానం చెప్పాడు. 'గూఢచారులు!—'

ఈ వ్యవహారం మరింత ఆకళింపుగా తెలిసిన మూడోమనిషి చెప్పాడు. అది రోజర్ క్లయ్ అనే గూఢచారి శవమని'—

'అతం గూఢచారేనా?'—

'ఓల్డుబెయిలీ గూఢచారి! యెధవలు! ఓల్డుబెయిలీ గూఢచారియెధవలు!'

'అవు వస్నోయ్! అణ్ణి యెరుగుదును' అన్నాడు క్రంచర్, సిడ్నీ కార్టన్ విచారణనాటి సంఘటన నెమరుకు తెచ్చుకుని: చచ్చాశేం?'—

'చావక బతికేడుస్తారా?—ఠక్కా చావు చచ్చాడు! యెధవలు!'

ఇంతలోనే జనానికి ఆవేశం మరింత యెక్కువైంది. బండి నిలవేసి కాకిమూకలా ఎగబడిపోయారు. బండిలో కూర్చున్న దుఃఖాక్రాంతుడు చచ్చినవాడి దుఃఖం మరిచిపోయి ప్రాణాలు దక్కించుకుని యెల్లాగో ఓలాగు బండిమీదనుంచి క్రిందికి దూకి జనంలోనుంచి యివతలపడ్డాడు! చొక్కా జట్టా వాలికలై పోయినై. బ్రతుకు జీవుడా అని, రోడ్డువెంటబడి వెనక్కు తిరిగిచూడకుండా అదే పరుగెడుతున్నాడు.

ఈ హంగామా అంతా చూసి, కంగారై, వీధిలోవున్న దుకాణాలన్నీ యెక్కడివక్కడ చకచకా మూసేసి, వ్యాపారస్తులు తలో త్రోవనూ సర్దుకుంటున్నారు. అవును రోజులు అలాంటివి! జనానికి వెర్రియెత్తనేకూడదుగాని, వెర్రియెత్తటమంటూ వచ్చింతరవాత అది ఎక్కడ ఆగుతుందో ఎవ్వడూ చెప్పలేడు. జనంపడి బండిమీదినుంచి శవపేటికను రోడ్డుమీదికి దించిపారేసే ప్రయత్నంలో వున్నారు. ఇంతలో వాళ్ళల్లో ఒక ప్రబుద్ధుడికి ఒక మహత్తరమైన అభిప్రాయం తట్టింది. జనకంటకుడైన ఆ వెధవ చావనే చచ్చాడుగనుక, ఆనందంగా తామే ఉత్సవం సాగించి ఆ శవాన్ని భూస్థాపన చేసివస్తే బాగుంటుందని సూచించాడు. వాస్తవిక దృక్పథంతో వచ్చే సలహాలకు విలువనేది యేనాడూ వుంటుంది గనక, యీ సూచననూ యావన్మందీ వెంటనే ఆమోదించారు. సరే ఆ బండిమీదికి వీలైనంతమంది స్వచ్ఛందసేవకులు యెక్కి కూర్చున్నారు, ఒకళ్ళ

అనువాదం: తెన్నేటి సూరి

నొక్కట్లు తోసుకుంటూ. ఆ స్వచ్ఛంద సేవకులతో పాటు క్రంచర్ కూడా బండిమీదికి చక్రాలమీదుగా యెగబాకి, బండి వెనక పీటీలో నక్కి కూర్చున్నాడు. పెల్ సన్సు బ్యాంకు అధికారులెవ్వరికీ కంటబడకుండా వుండటానికి తల మోకాళ్లమీదికి వంచేసుకున్నాడు. ఈవిధంగా తిరిగి సంస్థరించబడిన ఈ ఉత్సవం తిరిగి వీధివెంట సాగిపోతూంది. రోడ్డున ఎదురైన మనిషల్లా ఉత్సవంలో చేరిపోతున్నాడు. సరే యెలాగైతేనేం శవపేటిక, దూరంగా పొలాల్లోవున్న సెయింట్ పాన్ క్రాస్ చర్చికి జేరింది. శవ లాంఛనాలన్నీ జరిపి చర్చిదొడ్లో భూస్థాపన చేసేశారు.

భూస్థాపనతో శవకాండ తీరిపోయింది. ఇప్పుడు జరి తెగిన ఆ జనానికి మరొక ఉల్లాసకార్యక్రమమేదైనా కావలసి వచ్చింది. ఉన్నట్టుండి వారిలో మరో ప్రబుద్ధుడు, దారినవస్తూన్న ఓ అమాయకుణ్ణి యెవణ్ణో చూపించి: 'అడుగో! వాడుకూడా గూఢచారే! ఓల్డుబెయిలీ గూఢచారే!' నంటూ అరిచాడు. అక్కడినుంచీ రోడ్డున వస్తూన్న వాణ్ణల్లా గూఢచారిక్రింద నేరారోపణచేసి వేట కార్యక్రమం కొంతసేపు సాగిపోయింది. అనంతరం ఆ కోలాహలం, కిటికీలు బద్దలుకొట్టడం, కొంపల్లో జొరబడటం లూటీలు చెయ్యటందాకా పరిణామదశ నందుకుంది. ఈ ప్రకారం ఒక నాలుగైదు గంటలు సాగిపోయిన అనంతరం, పోలీసులు వస్తున్నట్టు ఒక పుకారు బయలుదేరింది. ఆ పుకారు బయలుదేరగానే ఆ జనసమూహం యెక్కడిదక్కడ కర్పూరంలా హరించిపోయింది. రోడ్డుమీద ఒక్క పురుగుకూడా లేకుండా ప్రక్క సందుల్లోకి మాయమైపోయారు. అనంతరం పోలీసులు వచ్చారో లేదో కూడా తెలీదు.

క్రంచర్ తిరిగి టెల్‌సన్సుబ్యాంకుకు వచ్చేశాడు. ముక్కాలిపీటమీదనుంచి దిగి కుమారుడు తండ్రిఉద్యోగం తండ్రికి వప్పగింత చేశాడు. బ్యాంకి కట్టివేసే వేళయింది. బ్యాంకు గుమాస్తాలంతా ఒకరొకరే బయటికి వెళ్లిపోయారు. రాత్రివేళ కాపలావుండే మనిషివచ్చి క్రంచర్ స్థానంలో ఖైటాయించాడు. క్రంచర్ కొడుకుని వెంటబెట్టుకు యింటికి బయలుదేరాడు.

ఇంటికి వచ్చి రావటమే పెళ్లాంమీదరంకెలు ప్రారంభించాడు :

'ఇదుగో! చూసుకో తడాఖా!— నేనేదో చెమటోడిచి బతికే పెద్దమడిసిని. ఇయ్యాలరాత్రి నేను పెట్టుకున్న పనిగనక నెరవేరకపోయిందో చూసుకో నిస్నేం జేస్తానో. అదిగనక చెడ్డదంటే, నీప్రార్థనల మూలంగా నేచెడ్డదని తేలిపోతది. నీమక్కాలిర గేశానన్నమాటే!'—

తన స్థితికి తానే దురపిల్లుతూ, ఆ యిల్లాలు, అయోమయంగా తల ఊపింది.

'అదుగో నా మొహామెదటే మొదలెడతావుండావ్ !యెదవ ప్రార్థనలు !'—

'ఎబ్బే! లేదే! నేనేమీ ప్రార్థించటం లేదే'—

'అఁ! అట్టా కబర్దార్‌గా వుండు! నువ్వు ఏంజేసినా సరే వూరుకుంటాగాని ప్రార్థనలంటేమాత్రం వొళ్ళు హూనం అవుద్ది.'

'సరే!'—

'సరే! గిరే! ఇయ్యన్నీ నాకు పనికిరావ్ !—బతకాలనుంటేచచ్చినట్టు పడుంటు.' తను మాట్టాడుతున్న మాటల అర్థమేమిటో తనకే తెలియకుండా ఈమాదిరిగా రంకెలేస్తూ భోజనం దగ్గిర కూర్చున్నాడు. ఆ రకం మనుషుల ధోరణికి అదో అర్థపర్థం అంటూ వుండదు. జీవితంలో వుండే చిరాకంతా ఆవిధంగా బయటికి వస్తావుంటుంది.

'ఈ రాత్రి బయలుదేరుతున్నావా?' అన్నది భార్య ప్రక్కను పిల్లిలా కూర్చుని.

'అవును'

'నేనుకూడా నీతోయింటవొచ్చేదా అయ్యా?' అన్నాడు కొడుకు.

'వల్లగాదు— నేను చేపలవేట కెడతా వుండాను—ఇంకా కావలిస్తే మీ అమ్మ నడుగు—చేపలు బట్టటానికి కెడతా వుండాను తెలుసా?—నువ్వు రావటానికి యీల్లేదు.'

'చేపలు ఇంటికి తెస్తావా? అయ్యా?'—

'ఏడిశావులే—నీ యెదవప్రశ్న 'లక్కడితో ఆపెయ్—అసలు నువ్వు నిద్దరోయేదాకా నేను బయల్దేరనే బయల్దేరను.'

ఆరాత్రి ప్రొద్దుబోయేదాకా క్రంచర్, భార్య తనకు వ్యతిరేకంగా ప్రార్థనలు చెయ్యకుండా వుండటానికి పహరా కాస్తూనే వున్నాడు. ఒకవేళ మనసులో యేమన్నా ప్రార్థించుతుందేమోనని భయంతో ఏదో సంభాషణలోకి దించి చివాట్లు పెడుతున్నాడు. తాను కొస్త ఇటూ అటూ పనిచూసుకోవలసివచ్చినప్పుడు ఆ చార్జి కొడుక్కు వప్పగింత చేస్తున్నాడు. దెయ్యాలలో పసేమీ నమ్మకం లేనివాడు దెయ్యాలకథ విని హడలిపోయినతంతులా వుంది అతని ప్రవర్తన.

'ఇదుగో! ఇటు చూడు! రేపు నీ ఆటకోటి యాసాలేమీ పనికిరావు. ఏదో ఇంత మాంసంగీసం తెస్తానకో నువ్వు అంటను ముట్టనంటే అదేం పనికిరాదు. పెద్దమడిసి యవహారంగా యింతో అంతో సారా తెచ్చానంటే నువ్వు తాగితీరాలిసిందే. నీ మతం గితం నీ రోమ్ గీమ్ ఇయ్యన్నీ నాకు పనికిరావు. రోమేంటి రోమ్! నేనే నీరోమ్! మళ్ళీ మట్టాడితే నేనే నీ మతగురువు—నేనే నీ దేవుడు.'

మళ్ళీ సణగటం ప్రారంభించాడు : 'ఒసి నీ దుంపతెగా! అటు చూడవే బిడ్డ యెంత నాదారిపోయాడో—ఇంత మాంసమో మట్టో ఆడి మొహాన పారెయ్యవుగందా? నీ మతం తగలెయ్యా ఆడు యెట్టా బతుకుతాడే—యేవి తల్లివే! కన్నావు మళ్ళీ—బిడ్డను పెంచుకోటం చేతగానితల్లి యేం తల్లి యెదవతల్లి.'

దాంతో జర్రీకి తల్లి తనపట్ల చూపుతున్న ఉదాసీనతకు కోపం ముంచుకొచ్చింది; తల్లివంక కోపంగా చూచాడు.

అనంతరం క్రంచర్ వెళ్లి పడుకోమని కొడుకును హుకుం

(39-వ పేజీ చూడండి)

# చదరంగం

ఈడూ జోడూ చాలా బాగుందని పెళ్లికివచ్చిన పెద్దా చిన్నా అనకుండా అంతమందీ ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. అటు ఆ జిల్లానుంచి ఇటు ఈ జిల్లానుంచి ఆమాత్రం ఈమాత్రం పెద్ద మనిషన్న పేరు ప్రతిష్టలు గల ప్రతీవ్యక్తీ ఆ పెళ్ళిపందిట్లో కనిపించాడు. ఆ పందిరి క్రింద ఆ అయిదురోజులూ ప్రపంచంలోని అన్ని విషయాలూ అటు కొరియాయుద్ధం దగ్గరనుంచి ఇటు రాయలసీమలోని కరువు కాటకాలవరకూ చర్చలు జరిగాయి. ఆపైని ఈశరీరం వట్టి మట్టిబొమ్మే నన్న పరమార్థ రహస్యాలమీద కొంతమంది నిర్విచార స్వాముల వార్ల ఉపన్యాసాలు జరిగేయి. అప్పట్లో భోగం మేళాలు లేవని అలిగిన కుర్రకారుతప్ప తతిమ్మా జనవర్గమంతా ఒకప్పుడు కాకపోయినా ఒకప్పుడైనా ఈ ప్రపంచం అంతా వట్టి శూన్యం అన్న తత్వజ్ఞానంలోపడి తరించారు.

తన వియ్యంకుడు నిజంగా స్వార్థరహితుడని పెళ్ళికొడుకురాజన్న తండ్రి సీతయ్య ఎంతైనా పొంగిపొయ్యాడు. తన అదృష్టంకొద్దీ ఆ సంబంధం దొరికిందనుకున్నాడు. లేకపోతే లక్షలమీద నిలబడ్డ నాయుడు రావన్న ఎక్కడ? చితికి శిథిలావస్థలోనున్న తనెక్కడ? ఒకప్పుడు అంటే... తన చిన్నతనంలో... సంచులతో రూపాయలు బళ్ళతో తమ యింటికి వచ్చాయని, వాటిమీద తమ తాతపడుకుని పెద్దలచేత కాళ్ళు పట్టించుకొనేవాడని, ఆ దోషంవల్లే ఇప్పుడు తాము ఈ స్థితికి వచ్చామని అందరూ చెప్పుకుంటే వినేవాడు. అప్పటినుంచీ ఇప్పటివరకూ ఎదుగూబొదుగూ లేకుండా తమ సంసారం "ఒకుడు" చెట్టులా అలానే ఉండిపోయింది. తనూ ఆ వచ్చినదాంతోనే సరిపెట్టుకుంటూ ఒకరిచేత వేలెట్టి చూపించుకోకుండా వస్తున్నాడు. పోనీ ఇప్పుడైనా ఈ సంబంధం కలసిరావడంవల్ల నల్గురిలోనూ కొంచెం పైకి రావచ్చునని ధైర్యం పొందేడు.

కూతురు పెళ్ళిఖర్చుకంటే కట్నం కానుకలు రెట్టింపు రావడంవల్ల, పైకి ఎంతో పెద్ద బరువుమోస్తూ అలసిపోయినవాడిలా కన్పించినా లోలోపల పొంగిపోయాడు నాయుడు రావన్న. ఆ మధ్య తన దగ్గరకు భూమి పంపకాల తీర్పుకు వచ్చిన అన్నదమ్ముల రెండుం ముప్పాతిక ఎకరాల ఫస్టుక్లాసయిన పల్లపు భూమి కొనెయ్యొచ్చన్న అంచనా వేసుకొన్నాడు. కాకపోతే ఆ డబ్బుతో కూతురుపేరు మీదుగా ఏదైనా వ్యాపారంపెట్టి అన్నిపనులూ తను చూసుకుంటూ పేరుకు మాత్రం అల్లుడిని పెద్దగా నిలబెట్టి అతని చేతిమీదుగా వ్యాపారం నడుస్తుందని అందరికీ అవగాహన అయ్యేటట్టు చేస్తే, కూతురు గుమ్మందాటి అవతలకి, అంటే అత్తవారింటికి వెళ్ళనవసరం ఉండదూ, అల్లుడు ఇల్లరికం వచ్చాడన్న వాదూ ఉండదు. తనకూ నాల్గురాళ్ళు కంటికి కనిపిస్తాయి అన్న నిశ్చయానికి వచ్చాడు.

నాయుడు రావన్న అనుకున్నది ప్రకారం ఆచరణలో పెట్టాలనుకున్న ఉద్దేశంతో, కోడలిని తీసుకువెళ్లడానికి వచ్చిన వియ్యంకుడు సీతయ్యతో మెల్లిగా అన్నాడు. "ఏమండీ బావగారూ! కుర్రాడు అనవసరంగా మీ దగ్గర కూర్చొని తినేకంటే ఇక్కడికి పంపించెయ్యకూడదూ? కలపవర్తకం పెట్టిద్దామని వుంది. మీ ఉద్దేశమేమిటి?"

ఈ ప్రశ్నతో ఏదో మోస్తున్న బరువు ఆశ్చర్యకరంగా మాయమైనట్టయింది. సీతన్నకి తన అంచనా ప్రకారం అప్పుడే మొదటి సోపానం ఏర్పడబోతోంది. లోలోపల ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. ఈ దెబ్బతో శతాబ్దంనుంచి తమమీద తాండవం చేస్తున్న శనేశ్వరుడు పరారవ్వవలసిందే. నమ్రతగా జవాబిచ్చాడు "మీ ఇష్టం ఎలా ఉంటే అలానే కానివ్వండి. న్యాయంగా వాడిబాధ్యత నాకంటే పిల్లనిచ్చిన మీపైనే ఎంతైనా ఉంది. మీరు అవునంటే నేను కాదంటానా!?"

ఈ జవాబు విన్న నాయుడు రావన్న నిజంగా ఆశ్చర్యపోయాడు. ఇంత సులువుగా తన వియ్యంకుడు రాజీపడ్తాడని కలలో కూడా అనుకోలేదు. కులాసాగా అన్నాడు "సరే ఇక ఆలస్యం దేనికి? మీరు వెళ్లి కుర్రాడిని పంపించెయ్యండి. ఈలోగా నేను అన్నిపనులు రైటుచేసి ఉంచుతాను. అవున్నట్టు అమ్మాయిని ఇప్పుడు మీతో పంపడం అనవసరమనుకుంటాను. అబ్బాయి ఇక్కడకు ఎలానూ రానేవస్తాడు. ఇద్దరూ చిలకా గోరువంకల్లా మా కళ్ళముందు మసులుతూ ఉంటే మాక్కావలసిందేముంది? లేదూ.. తీసుకువెళ్లాలన్న నియమం ఉంటే ఏ మాత్రం అడ్డులేదు. ఎప్పుడైతే మా పిల్లను మీ చేతుల్లో పెట్టామో అప్పుడే మీ హక్కు. ఏమంటారు?" వియ్యంకుడి మాటకు ఎదురు చెప్పకూడదని మొట్టమొదటే నిర్ణయించుకున్న సీతయ్య మౌనంగా ఊరుకున్నాడు. అదీకాక తన వియ్యంకుడు నిజంగా నిరాడంబరుడు. పెళ్ళి పందిట్లో ఏర్పాటుచేసిన ఆ ఉపన్యాసాలే దీనికి తార్కాణం. ఇందులో అతని స్వార్థానికి మాత్రం ఏముంది! ఎటొచ్చీ తనే పూర్తిగా అతనిమీద ఆధారపడి ఉన్నాడు "మీ మాటకు అడ్డుందా. మీ ఇష్టమే నా ఇష్టం. కుర్రాడి పూచీ పూర్తిగా మీదే నీటముంచినా పాలముంచినా ఆ భారమంతా మీదే. ఇంటికి వెళ్ళగానే పంపించివేస్తాను."

తండ్రి చెప్పినట్టు అక్షరాలా జరిపిస్తానన్న వాగ్దానంతో రాజయ్య అత్తవారింట్లో కాలు పెట్టేడు. కాలం కులాసాగా జరిగిపోతోంది. కలపవర్తకం కూడా జోరుగా సాగిపోతోంది. కాలుపెట్టిన వేళావిశేషం మంచిదవడంవల్ల సంవత్సరం తిరగ్గానే అనుకున్న దానికంటె రెట్టింపు లాభం వచ్చింది. నాయుడు రావన్న భార్య నీళ్ళుపోసుకుందని విన్న రాజన్న సంతోషానికి పట్టపగ్గాలు లేవు.

రాజన్న తండ్రికి కబురుచేసేడు. వార్త విన్న సీతయ్య భార్యాసమేతంగా వెళ్లేడు. లాంఛనప్రకారం ఇచ్చి పుచ్చుకోవడాలు సామాన్యంగా జరిగిపోయాయి. అటు రావన్న కుటుంబం ఇటు సీతయ్య కుటుంబం ఎంతైనా సంతోషించారు.

లాభం వచ్చిందన్న సంగతిని సీతయ్య మెల్లిగా కొడుకును కదిపేడు.

★ శ్రీ రుద్రపాటి శామ్యూల్ జాన్ ★

"ఏరా! మీ మావను అడిగేవా? ఆలస్యం చేస్తే లాభం లేదు. లాభం రెట్టింపు వచ్చిందటగా? మొన్న నేను మాటవరసకి వ్యాపారం ఎలా ఉందని అడిగితే ముఖం చిట్లించుకుంటూ దానిది దానికి సరిపోయేటట్టుందన్నాడు. ఊరంతా కోడై కూస్తుంటే ఈయన అలా అంటాడేం? నా దగ్గర రహస్యం దేనికి? పోనీ నాదగ్గరదాస్తే నిన్ను దాయగలడా? లోకంనోరు మూయగలడా? లేకపోతే కొంపతీసి ఆర్నెల్ల సావాసంతో వారే వీరౌతారన్నట్టు నువ్వూ మావకు తాళంవెయ్యాలనుకుంటున్నావా?"

ప్రారంభంలోనే తండ్రి ఏకంగా తన మీద కోపంతో దాడిచేస్తున్న ధోరణికి అంతవరకూ ముభావంగా ఊరుకున్న రాజయ్య కాస్తా భయపడ్డాడు. తేలిగా నచ్చేటట్టు జవాబిచ్చాడు. "ఏం నేనంత తెలివితక్కువవాడననుకున్నావా? ఏదీ - ఇప్పుడిప్పుడే లెక్కలు తేలేయి. అన్నీ సవ్యంగానే ఉన్నాయి. ఈవేళో రేపో సమయం చూసి అడగాలనుకుంటున్నా. తొందరపడడం దేనికి?"

కొడుకు జవాబుతో సీతయ్య స్థిమిత పడ్డాడు. "అబ్బే నువ్వు ఇంకోలా అనుకోకు. నేను మామూల్గా చిన్న హెచ్చరిక చేసేను. ఏంచేసినా ఏ గడ్డికరిచినా నీకరించే నాకుమాత్రం ఎవరున్నారు? సర్వం నువ్వే."

వ్యాపారంలోని లాభనష్టాలగురించి పట్టుదలగా సీతయ్య కలిగించుకొని తనను అడగడమే కాకుండా గుమాస్తాలు మొదలయిన పరివారందగ్గరకూడా భోగట్టా తీసుకుంటున్నాడని చూచాయగా విన్న నాయుడు రావన్న ఎంతైనా చీకాకు పడ్డాడు. తనలో అనుకున్నాడు "మధ్య వీడికెందుకీ తగవు! తను ఈ మాట అడిగినప్పుడు పైకి గట్టిగా అనేద్దామనుకున్నాడు. కాని ఎందుకో సాహసించలేకపోయాడు. అదీకాక తండ్రీకొడుకులు ఏకాంతంగా ఏదో మాట్లాడుకోవటం వల్ల అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది. తన సర్వస్వం కాళ్లూ చేతులూ కట్టి ఎవరో దోపిడిగాండ్రు దోచుకుపోతున్నట్టనిపించింది. అయినా వెంటనే నిబ్బరపడ్డాడు. ఏమాత్రం అవక తవక వచ్చినా అల్లుడైనాసరే లెక్కలేకుండా మెడపట్టుకు బైటికి గెంటుతాడు. ఏది ఎలా ఉన్నా అసలు వ్యాపారం కూతురుపేరుమీదే ఉంటు! ఆమె తను గీచిన గీటు దాటదు. తనకా నమ్మకం ఉంది. ఇక తాను భయపడ్డం దేనికి? స్థిరనిశ్చయానికొచ్చాడు—ఏమాత్రం మొగమాటానికీ వెళ్ళకూడదని.

రాత్రి భోజనానంతరం అక్షరాలు కూడ బలుక్కుంటూ భగవద్గీతలోని తాత్పర్యాలు చదువుకుంటున్నాడు నాయుడు రావన్న. ప్రక్కనున్న పడకకుర్చీలో అల్లుడు రాజయ్య తాపీగా నడుం వాల్చేడు. ఓప్రక్క చదువుతూ ఓప్రక్క అల్లుడు రావటం, చప్పుడు చెయ్యకుండా కూర్చోవటం కనిపెట్టిన రావన్న భగవద్గీత మూసి మెల్లగా అడిగేడు "ఏమోయి ఇలా వచ్చావు?"

తను అడగబోయే విషయం మావగారితో ఎలా ప్రారంభించాలో తెలియక తికమక పడుతూ ఆలోచనలో పడ్డ రాజయ్యకు మొట్టమొదట మావగారే పలకరించడంవల్ల కొండంతభారం తలమీదినుంచి తగ్గినట్టయింది. నమ్రతగా జవాబిచ్చాడు "అబ్బే ఏం లేదండి."

ఎన్నడూ లేంది ఈనాడు పనిపెట్టుకొని అందులోనూ — తను భగద్గీత పారాయణ చేస్తున్న వేళలో పట్టుదలగా పిల్లిలా వచ్చి కూర్చుని అల్లుడిచ్చిన జవాబులో అర్థం లేనట్టయింది. ఎందుకైనా మంచిది. ముందు తను జాగ్రత్తపడడమే మంచిది. లేని ప్రశాంతతను ముఖంలో కనబరుస్తూ

(19-వ పేజీ చూడండి)

# చర్విత చర్వణం

గాజులమ్మేవాడు: అమ్మగారూ! యివి మేలురకం గాజులు. అతి చౌక, పుచ్చుకోండి. ఈసరుకు యిప్పుడే వచ్చిందండీ పైనించీ—

శ్రీహరి: ఎక్కడినించి వస్తే మాకేం. మాకు బాగున్నవి, సరసమైన ధరకు యివ్వటమే కావాలి. అంతేగాని యీ సరుకు ఎప్పుడు వచ్చిందీ, ఎట్లా వచ్చిందీ, అన్నీ అనవసరం.

గా: మీకు అవసరమని గాదండీ, గాజులనాణ్యం గురించి చెపుతున్నాను.

శ్రీ. అట్లా యేం చెప్పకు

రాధ మగవాడివి, నీ కెందుకురా గాజులబేరం?

శ్రీ. అదేమి టక్కయ్యా?

రా: ఏమిటేమిటి, మగవాడివి కదా, గాజులొడుక్కూర్చుంటావా? నీ కెందుకా బేరాలూ?

శ్రీ: చిత్రంగావుంది నువు చెప్పేది. గాజులు తొడుక్కు కూర్చుంటేనే బేర మాడాలన్న మాట!

రా: అది కాదురా, ఆడవాళ్ల బేరాలు నీకెందుకూ అని!

శ్రీ: ఆడవాళ్ల బేరమేమిటి గాజులు? మగవాళ్లకవసరమయినవెన్ని ఆడవాళ్లు బేరం చేయటం లేదు?

రా: నీతో వాదించటానికి నాకు తీరుబడి లేదు.

గా: ఎందుకమ్మా పోట్లాడుకొంటారు? యీ గాజుల వయిభవం చూడండి.

రా: గాజులు యిప్పుడు కొనను నేను. ఈమాట నీకు లక్షసార్లు చెప్పాను. అనవసరంగా దింపి, పైగా గోల. ఇంటో అందరిపనీ పాడుచేస్తున్నావ్.

గా: నేనా? అంతపాపంచేశానా? యేదో గాజులు, ఎప్పటిమాదిరిగా కొంటారుగదాఅని నేను రావటమేమిటి, మీరు నామీద వేసిన యీ అభాండ మేమిటి? రామరామ!

రా: రామలేదు కృష్ణలేదు. నీతప్పు నీతప్పే. నిజంచెప్పు-నీవు రాగానే మొదట-యిక్కడ సరుకు దింపుకోవద్దని చెప్పానా లేదా?

గా: చెప్పారనుకోండి, కాని అట్లా చెప్పందెప్పుడు? చెప్పి తీసుకున్నరోజులున్నాయిగా.

రా: పైగా యిదొకటా? మా మాటలన్నీ అబద్ధాలంటావా?

గా: మీ మాటలు అబద్ధాలని నేనన్నానా? విషయం చెప్పాను.

రా: విషయం చెప్పావూ? వొచ్చి పావుగంటైందిగదా, నేను కొనని చెవి తిని ఇంకా యేమిటి?

గా: వినుండండీ, కొత్తగా వచ్చిన సరుకని పూర్వమే మనవిచేసుకున్నాను. అంతా ఎగబడికొంటున్నారు. తీరా అయిపోయాక, నాకు యివ్వలేదేమయ్యా, అంటారేమోనని ముందే జాగ్రత్తపడ్డాను.

రా: అబ్బ! అక్కర్లేదని చెపుతున్నానా? పోనీ, యిప్పుడు చెప్తున్నాను. వెళ్లు. నాకు వొద్దు అవి.

గా: కొనకపోతే మానె. నామీద దయవుంచి యీ గాజులొకసారి చూడండి.

రా: వొద్దని చివరిసారిగా చెబుతున్నాను. నాకు కోపం తెప్పించకు.

గా: మీకు కోపమా? పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వెయ్యకండి. కొనద్దంటినిగా. చూడండి.

శ్రీ: ఆవిడ వద్దంటూంటే, నీ కెందుకోయ్ శ్రమ.

గా. మీకు తెలీదు, ఊరుకోండి అబ్బాయిగారూ, అమ్మగారూ, యివి చూడండి.

రా: నువు ముందు లేచి అవతలకి వెళ్లు.

గా: కోప్పడకండి. బేరంకోరి వచ్చాను.

శ్రీ: లాభంలేదయ్యా, మేమేమీ కొనం. వెళ్లు.

గా: మీరు కొనక్కర్లేదండి. ఊరికే చూడమంటినిగా. చూస్తే కళ్లేం కరిగిపోతాయా?

శ్రీ: కళ్లు కరిగిపోతై నిజం. చూడం. వెళ్లు.

గా: ఇంత మొండితనం చేస్తారేమండీ, నే నేమన్నానని?

రా: నువు చూడబోతే తిన్నయింటివాసాలు లెక్కబెట్టే మోస్తరుగా వున్నావు. మొండితనం చేస్తున్న దెవరబ్బీ?

గా: తప్పు వప్పుకుంటాను. క్షమించండి. నేనే.

శ్రీ: క్షమించాం. వెళ్ళు

గా. అట్లా వెళ్లేవాడినే అయితే, అసలు రాకేపోదును.

రా: యేమిటయ్యా యింతకీ?

గా: గాజులు చూడండి, మరేముంది...?

రా: ధంపేశావు. నీమాటే నీకుగాని, మేంచెప్పేది చెవినిబెట్టవు. గాజులు తీసుకోందీ వదలవు – అంతేగా!

శ్రీ: అదంతా వ్యాపారం టెక్నిక్ మరి! ముందు 'కొనద్దు, ఊరికే చూడండి' అంటాడు. తీరాచూచాక కొనబుద్ధి అవకండా మానుతుందా? అంతగా కొనకపోతే, 'ఇంతసేపూ చూచారు, ఊరికే పంపేస్తున్నారు' అని నిష్ఠూరాలాడతాడు. అంతా ఆలోచనమీది వ్యవహారం.

గా: మీరేదో పెద్దపెద్ద మాటలు మీలో మీరనుకుంటున్నారు. అవన్నీ నాకు అర్థం అవుతయిగనకనా? దయచేసి గాజులు చూద్దురూ.

రా: మళ్ళీ మొదలూ...

శ్రీ: ఎన్ని మాటలయినా చెబుతాడు అక్కయ్యా, చివరకొచ్చి 'గాజులు చూడు' అనే! భూమి గుండ్రంగా వున్నదనేందుకిదొక నిదర్శనం.

గా. చూడండి, మళ్ళీ నాకు పొద్దుగుంకిపోతోంది. చీకటిపడకముందే యిల్లు చేరుకోకపోతే, మళ్లా మర్యాదక్కదు.

రా: అదేమిటి? చీకటి పడితేమాత్రం నీకేం భయం?

గా: నాకేంభయం—మా యింటిది పోట్లాడుతుందనిగాని—

రా: అదా?

గా: ఏమయినా, అమ్మాయిగారు, వొచ్చి మాద్దురూ, మీ పుణ్యమాయిరి.

రా: చూచే వోపిక నాకులేదు. నీకు పొద్దుపోతుందని అంత భయంగావుంటే; నాకేనా అంత వెసులుబాటూ?

గా: ఈ విధంగా చూడండి ఎంతకాలం వృధా అయిందో. నేను అడిగిన వెంటనే చూట్టానికి వచ్చినట్లయితే, యీ పాటికి అయిపోయేది. ఎవరిదారిన వాళ్ళం వెళ్ళిపోయేవాళ్ళం. మీపనీ వృధా చేసుకున్నారు. నాపనీ అవనిచ్చేరు కాదు.



యిప్పటికైనా మించుకుపోయిందేమీ లేదు. రాండి.

రా: నువు యెన్నయినా కబుర్లు చెప్పు. యింకేమీ పనిలేకపోతే యిక్కడ సత్యాగ్రహంసయితం చెయ్యి. నేనుమాత్రం మొదట అన్నమాటకు భిన్నంగా నడవను, ఎన్నటికీ.

గా: ఆగ్రహం కూడదు అమ్మగారూ, దయచేసి చూడమన్నాను. అంతకన్నా నేనింకే మనగల్ను ?

శ్రీ: చూచినట్లు అనుకోని వెళ్ళరాదు టోయ్ నువ్వు ?

గా: ఎట్లా అనుకోనండీ, మీ రేమో చూడకపోతిరి. చూచారని యెట్లా...

శ్రీ: అనుకోరాదూ, యిందులో మించుకుపోయే ప్రమాదం యేముంది?

రా: ఇన్ని మాటలు ఎందుగ్గాని, వెళ్ళి అమ్ముకో లాభం వొస్తుంది.

గా: అదీ. అందుకేగదండి నేను వచ్చింది. మీ నోటిపుణ్యాన నాకు లాభం రావాలి. ఇట్లా అనేక పర్యాయాలు వచ్చింది కూడా: మీరు బోణీబేరం చెయ్యాలి, తరవాత నేను అమ్ముకోవాలి. ఇది నాకు యీ బజారు వచ్చినప్పట్నించీ రివాజయిపోయింది.

రా: నీకు రివాజయితే అయిందేమో గాని; మాకింకా కాలేదు. అయినా ప్రస్తుతం నాదగ్గిర రాగి దమ్మిడీ అనదగ్గది లేదు. ఇలాంటి పరిస్థితుల్లో నేను బేరం ఎట్లా చెయ్యగల్ను చెప్పు. ఈ రోజుకు వెళ్ళు.

గా: మీదగ్గిర - దమ్మిడీయేనా లేకపోవటమేమిటండీ-పొద్దునలేస్తే ఎన్ని వందలో బేరాలాడుతూ వుంటారుగదా.

రా: యిది మరీ అన్యాయంగా వుంది. నీకు నా 'బోణీ' మంచి దవటమే ఓ విచిత్రం. తరవాత, అంత మాత్రానికని నేను ప్రతిరోజూ నీదగ్గర గాజులు కొనాలనటం అవివేకం. నిలువునా దోపిడీ చెయ్యటం తప్ప మరేమీ కాదిది.

గా: దోపిడీలు నేనెక్కడ చెయ్యగలనండీ? దొంగలు చేస్తారు, గజదొంగలు చేస్తారు. చేద్దామన్నా నాకు చేతవద్దూ?

శ్రీ: అనవసర ప్రసంగం. వెళ్లు. నాపనీ భంగం అవుతోంది.

గా: బాగుందండీ మీరు చెప్పేది. రెడ్డొచ్చి మొదలాడమన్నాట్ట. ఇంత సొదా

శ్రీహరి "గాజులు తొడుక్కు-కూర్చుంటేనే బేరమా లన్నమాట!"



విని తిరిగి అదేమాట! మీ పనికి నేనేం భంగం చేశాను? కనీసం చెయ్యి లేసు గూడా! నేను అమ్మగారిని చెయ్యమన్న ప్రతి పనీ మీరే చెయ్యటానికి సిద్ధపడుతూ పైగా...చదువుకున్న వారు యిట్లా అంటే...?

శ్రీ: పోయి—అమ్మకోవయ్యా, సోది...

గా: అమ్మగారూ, యీయన్ని నామీదికి వదిలి మీరు వినోదిస్తూ కూర్చున్నారా? ఏం ధర్మమండీ?

రా: తమ్ముడూ నీ పని నువు చేసుకుందూ, అతడేపోతాడు.

శ్రీ: నాదా తప్పు?

రా: నాది! అసలు గాజులు కొనటమే తప్పు నాది. వెళ్ళవయ్యా గాజులు కొనన్నేను. యిప్పుడే గాదు యెప్పుడూ కొనను.

శ్రీ: అదేమిటక్కా, గాజులు కొనకండా ఎట్లా గడుస్తుంది! ప్రస్తుతానికి కొననను, అంతే—

గా: ఇప్పుడు మాత్రం ఎందుక్కొనకూడదండీ? సరిగ్గా నెలమీద పదిరోజు లయింది మీకు పోయిన తడవ గాజులిచ్చి. నెలకోసారన్నా మమ్మల్ని కనికరించక పోతే ఎలా చెప్పండి.

రా: అయితే ఎవరికోసమయ్యా గాజులు కొనేది, నీకోసమా?

గా: కొదనుకోండి, మీరు పెట్టుకోటానికేగదా కొనాల్సింది. అంతమాత్రం చేత నాకు అందులో యేమీ లాభం లేదని ఎట్లా చెప్పకోను?

రా. భేష్.

గా: ఇంతకూ యేం సెలవిప్పించారు? ఈ రకం ఒక డజను, ఆ రకం ఒక అర డజనూ యిస్తాను తీసుకోండి.

రా: తీసుకోనని మొదట్నించీ చెబుతోనేవుంటిని గదా.

గా. చెబితే మాత్రం యేమండీ, యివ్వనని నేనన లేదుగదా.

రా: ఇవ్వనని నువెట్లా అంటావు, గంటనించీ తీసుకోమని పోరుతున్నవాడివి.

గా: తిట్టకండి, అమ్మగారూ, తీస్తున్నాను యేమంటారు?

రా: రెండు నాలుకల్లేవు నాకు.

శ్రీ: ఊరికే యిచ్చేట్లయితే ఎన్నయినా తీసుకుంటాం.

గా: పోనీ అట్లాగే తీసుకోండి, మీదయ. ఇదిగోనండి అమ్మగారు—మొత్తం డజనున్నర.

రా: వద్దయ్యా బాబూ వద్దు. ఇదెక్కడో బలవంతపు బ్రాహ్మణార్థంలాగుందే!

గా: సెలవండీ అమ్మగారూ. రేపొస్తాను బాబూ.

రా: వెళ్తున్నావా యేమిటి? అన్నీ యిక్కడే వొదిలి నీకు డబ్బెక్కడ యివ్వగలం. తమ్ముడూ వెళ్ళాడా యేమిట్రా గాజులతను?

శ్రీ: వెళ్ళాడక్కయ్యా వెళ్ళాడు. రెండురకాల గాజులూ యిక్కడే వొదిలి వెళ్ళాడు.

రా: పిలవరా. వెళ్తుంటే చూస్తూ కూర్చున్నావా?

శ్రీ: పట్టికట్టి ఆపలేంకదా. అబ్బీ! గాజులబ్బీ...లాభంలేదు. పిలుపు అందనంతదూరం వెళ్ళిపోయాడు.

రా: అయ్యో రేపొచ్చి డబ్బుకోసం గోలచేస్తాడ్రా.

శ్రీ· డబ్బులేదు, డబ్బులేదు. ఊరికే యిస్తే తీసుకుంటామంటేగదా యిచ్చాడు.

రా: అంటానికేం. కాని తీరా, చూస్తూండు...రేపు డబ్బు యివ్వమని వెంటపడతాడు.

శ్రీ: డబ్బులిమ్మన్నప్పుడు, వాపసే చేస్తే సరిపోయె!

రా: అంతే చేదాంలే. అవిమాత్రం భద్రంగా దాచు. జాగ్రత్తసుమా! ★

# చదరంగం

(15-వ పేజీ తరువాయి)

లాలింపుగా అన్నాడు. "ఇదుగో అబ్బాయి ఇప్పట్లో కొడుకువైనా నువ్వే అల్లుడివైనా నువ్వే. ఇదంతా ఎవరి దనుకున్నావ్? నాకేం కావాలా? కన్నకొడుకుండగా నేనిలా అంటున్నానని నువ్వు సందేహించవచ్చు. సంవత్సరమైనా దాటని వాడు బ్రతికి బయటపడ్డప్పుడు చూచుకుందాం. అదిగాక వాడు పెరిగి పెద్దవాడయ్యేవరకూ నేనుంటానన్న నమ్మక మేమిటి? ఈ ఆఖరి దశలో భగవంతుడు హాయిగా కాలం వెళ్లనీయకుండా నాకీ సంతానాన్నెందుకిచ్చాడో? ఇదంతా వట్టి మాయ. ఈ మూడునాళ్ళ ముచ్చటకోసం మనమంతా ఆల్లరిపడిపోతాం. ఆ! అసలు విషయం మర్చిపోయాను పట్నంలోకూడా వ్యాపారం ప్రారంభిద్దామని ఉంది నీ ఉద్దేశ్య మేమిటి?"

ప్రసంగాన్ని వైరాగ్య ధోరణిలో ప్రారంభించి వ్యవహారికంతో ముగించిన మామగారు ముందరికాళ్ళకు బంధం వేస్తున్నాడని రాజయ్య సులువుగా గ్రహించేశాడు. అన్నీ తెలిసి ఉన్నట్టు తన తండ్రి ఎన్నో పర్యాయాలు మామ సామాన్యుడు కాడుసుమా!" అని చేసిన హెచ్చరిక అక్షరాలా నిజమై కూర్చుంది. అదీగాక తను మామగారి చర్య సంవత్సరంబట్టి కనిపెడ్తూనే ఉన్నాడు. ఇన్నివేల వ్యాపారం తన చేతులమీదుగా నడిపిస్తున్నట్టు పైకి నాటకం ఆడుతూ ఓ ఎర్రటి ఏగాని తను స్వతంత్రించి ఖర్చుచేసుకోటానికి వీలు లేకుండా చేసేడు. అదంతా మర్చిపోయాననుకున్నాడేమో? ఇప్పుడు బుజ్జగిస్తూ మాటలతో మేరుపర్వతం ఎక్కించేస్తే పొంగి అతని చిక్కంలో పడిపోతాననుకున్నాడు! ఇతని ధోరణి చూస్తుంటే "నీకీక కొయ్యడానికి వజ్రాలు పొదిగిన బంగారం కత్తి చేయించాను సుమా!" అన్నట్టుంది. ఏమైనా పరే నాన్న చెప్పినట్టు జరిగించి తీరాలి. అడిగేస్తాను. ఏం పీక తీస్తాడా? హక్కుంది గాబట్టి అడుగుతాను. అనే పూర్ణ నిశ్చయానికొచ్చాడు.

"అలాగే. మీ ఇష్టం ఎలా ఉంటే అలా కానివ్వండి. ఈమాత్రం దానికి నన్నడగడం దేనికి? మీరుమాత్రం మమ్మల్ని అన్యాయం చేస్తారా? ఆ మాట అనుకుంటే పురుగులు కారి చస్తారు. అవునన్నట్టు! ఈ సంవత్సరం వచ్చిన లాభం పంపకాలు వేసి మీరన్నట్టే పట్నంలో వ్యాపారం ప్రారంభిస్తే చాలా బాగుంటుంది. ఏమంటారు?" ఈ నాలుగు మాటలూ ఎంత వేగం అనాలో అంత వేగం అనేసి రాజయ్య మామగారి ముఖంలోకి చూచాడు.

ఎత్తుకుపై ఎత్తు అన్న ధోరణిలో అల్లుడిచ్చిన జవాబుకు నాయుడు రావన్న తృళ్లిపడ్డాడు. ఇంతవరకూ ఏవక్కరూ తన మాట కాదనలేదు. తన అన్నగారు భూమి పంపకాల్లో తనను కాదని సర్వనాశనమయ్యాడు. అటువంటిది ఈనాడు తన అల్లుడు ఎదురుతిరిగేడు. తుదకు, తన జన్మవిరోధయినా తనతో ముఖాముఖిగా మాట్లాడి తను అవునన్నది వాళ్ళు కాదనలేరు. వీడనగా ఏమాత్రం? అల్లుడయితే ఎవరిక్కావాలి? చూస్తూ సర్వం దోచుకుంటానంటే ఊరుకుంటానా? నా నోట్లో నువ్వు వ్రేలు పెట్టు నీ కంట్లో నేను వ్రేలెడతాను అన్నట్టుంది వీడి వరస అనుకున్నాడు.

"ఏమిటోయి లాభాలు. లాభాలని మీ నాన్నా నువ్వూ ఒకటే గోల చేసిపారేస్తున్నారు? ఏం మీ డబ్బేమయినా ఇక్కడ దాచారా? మహామదు పెట్టి ఏడిసినట్టు? లాభం మీకు దేనికివ్వాలి? అందులోనూ నువ్వు పడిన కష్ట మేముందని? మూడు పూట్లా మస్తుగా భోంచేసి అక్కడకు వెళ్లి కూర్చోట మేగా? అంతగా కావాలంటే ఓ గుమాస్తా జీతం లెక్కలు కట్టి నీ తిండీ బట్టా ఖర్చులూ మినహాయించి మిగతా ఎంత వస్తే అంతా తీసుకో. ఇకమీదట నువ్వు ఇక్కడ ఉండనవసరం లేదు. మా అమ్మాయి నీతో వస్తానంటే నిరభ్యంతరంగా తీసుకుపో. లేదూ అంటే నే చెప్పినట్టు నడుచుకో. ముందుకు బాగుపడ్తావ్" కూతురు తను చెప్పినట్టు తు. చ. తప్పకుండా నడుస్తుందన్న ధైర్యంతో ముఖం చిట్లిస్తూ జోరుగా అనేశాడు.

అల్లుడన్న అభిమానమైనా లేకుండా ఇంత నిర్మొహమాటంగా మామగారు తనని మెడ పట్టుకొని ఇంట్లోనుంచి బైటికి గెంటినట్టు మాట్లాడ్డంతో రాజయ్యకు ఎంతైనా కోపం వచ్చింది. బిరుసుగా జవాబిచ్చాడు.

"పాపం పూరిబాబుగారి కొడుకును పెట్టుకొని లక్షలు గడిద్దాం అనుకుంటున్నావ్: నీకేం అచ్చి ఉన్నాకూ? నీ క్రింద చాకిరీ చెయ్యడానికి? నువ్వు కాళ్లు పట్టుకొని బ్రతిమిలాడినా నీ ఇంట్లో వుంటాననుకున్నావా? ఇదుగో ఇప్పుడే పోతాను" విసురుగా వెళ్ళిపోయాడు.

నాయుడు రావన్న ఏ విధమైన జవాబూ

ఇవ్వకుండా ముందున్న భగవద్గీత పేజీలు తిరగవెయ్యడం మొదలుపెట్టేడు. ఇంట్లో పెట్టెలు సర్దుతున్న చప్పుడౌతోంది. "వెళ్లిపోతున్నాడు కామోసు. శని విరగడైపోతుంది." అనుకున్నాడు తనలో.

బుర్ర వంచుకొని తదేకదీక్షతో మెల్లిగా అక్షరాలు కూడబలుక్కుంటూ పుత్రుడైనా సరే దుష్టుడైతే నాశనం చెయ్యమన్న ఓ శ్లోక తాత్పర్యాన్ని చదువుకుంటున్న నాయుడు రావన్నకు 'నాన్నా వెళ్తాను' అన్న కూతురు మాటతో, ఆదమరుపులో ఉన్నవాడి వీపుమీద దభీమని చరిచినట్లయింది. ఆశ్చర్యంతో బుర్ర పైకెత్తి చూచాడు. ఎదురుగా చిన్ననవ్వుతో కూతురూ, వెనకాల తలగుమ్మానికానించి బెంగతో కళ్లు వత్తుకుంటున్న భార్యా కనిపించారు. అప్రయత్నంగా అన్నాడు "ఎక్కడికి?"

"అదేవిటి నాన్నా అలా అంటారు? సర్వం తెలిసిన మీరే ఆలా అంటే, ప్రపంచ జ్ఞానం లేని మావరకూ వచ్చిందా? మా ఇంటికిపోతున్నానని నాభర్త వెళ్లిపోతుంటే నే వక్కదాన్నీ ఇక్కడ ఏమని ఉండేది? ఇన్నాళ్లు కనిపెంచి పెద్దదాన్ని చేసేరన్న విశ్వాసమైనా లేకుండా ఓ సంవత్సరం క్రిందట ఎక్కడనుంచో వచ్చిన ఓ అపరిచితుడితో వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డ నామీద మీకు ఎంతైనా అసహ్యం పుట్టవచ్చు. కాని ప్రపంచ నియమాలకి ఎవరైనాసరే కట్టుబడక తప్పదు. మీరూ ఆ నియమాలనే ఆచరణలో పెట్టి వయస్సు వచ్చేసరికి ఓ అయ్య చేతిలో పెట్టేగు. మీ బాధ్యత కొంతవరకూ అయిందనిపించారు. ఇక నా బాధ్యత నేను నెరవేర్చుకోవాలి. ఎప్పుడైతే ఆయన నా మెళ్ళో సూత్రధారణ చేశారో అప్పుడే ఆయన వశమయ్యాను. మీ మాట ప్రకారం ఆయన్ని విడిచి నేను ఇక్కడ ఉంటే లోకం హర్షిస్తుందా? మీరు ఉన్నన్నాళ్లు నాకు ఏ లోటుపాటులూ జరుగవు. నాకూ ఆ నమ్మకముంది. ఆతర్వాత నాగతి ఏం కావాలి? మీరే చెప్పండి? మీరే కదా ఈ డబ్బు అశాశ్వతం అన్న సంగతి ఎంతోమందికి ఎన్నో పర్యాయాలు బోధచేసేరు? ఆఖరికి నా పెళ్లిపందిట్లో కూడా మహామహుల చేత ఈ విషయం మీద ఉపన్యాసాలు యిప్పించారు. అవన్నీ ఏమయ్యాయి? ఆఖరికి మీమీ స్వార్థాలకోసం ఎత్తుకుపై ఎత్తులు వేసుకుంటూ మావగారూ మీరూ రోషాలతో చదరంగం ఆడేరు. మీ ఆటల మధ్య నలిగి నాశనమయ్యేది మేము. ఇలా ఎంతమంది యువతీయువకులు పెద్దల పట్టుదలల మూలంగా నాశనమయ్యారో? అటువంటప్పుడు ఈ వివాహాలెందుకు? అమాయకమైన జీవాల్ని వుసురు పెట్టడానికేనా? నేను మీకు నీతులు చెప్పేపాటి దాన్ని కాను. అయినా విధిలేక చెప్పవలసి వచ్చింది. ఆ వ్యాపారం నా పేరు మీదేగా ఉంది? అవునన్నట్టు ఆ పెట్టుబడిలో కానీకూడా మీ స్వంతం లేదనీ అమ్మాయి కట్నం కానుకల క్రింద వచ్చిన చదివింపులసొమ్మని అమ్మతో మీరే చెప్పేరు. ఇక మీకు అట్టే చెప్పలేను. ఇక మీకు అభిమానముంటే ఆ పట్నంలో వ్యాపారం ప్రారంభించి అన్నీ ఆయనకు అప్పచెప్పి మీరు సలహాలిస్తూ నడిపించండి. లేదూ అంటే ఆ పనేదో మేమే చూసుకుంటాం. వ్యాపారం నా పేరుమీదుగా రిజిష్టరీ చేయించిన కాగితాలు నాదగ్గరే ఉన్నాయి. వస్తాను"

నాయుడు రావన్న కాళ్ళకు వంగి నమస్కరించి మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది కూతురు. వెళ్ళిపోతున్న కూతుర్ని చూస్తూ నోటమాటరాక అలానే కళ్ళప్పగించి నిలబడిపోయాడు. ఆనాటి పెళ్ళిపందిట్లో నిర్వికార స్వాములవారి ఉపన్యాసాల్లోని కొన్ని మాటలు "ఈ ప్రపంచం వట్టిమాయ" "ఈ శరీరం మట్టిబొమ్మ" "అంతా శూన్యం" అన్న ముక్కలు అతని కర్ణకుహరాల్లో గింగురుపెట్టి రింగటాలు కొట్టుకుంటూ మాయమయ్యాయి ★

# దేవదేవుని దురవస్థ

గభాలున జారిపడనే పడ్డాను, వుప్పొంగుతున్న ఆశ్చర్యాంబుధిలో. కాని, మరుక్షణమే, ఆశ్చర్యం దుఃఖముగా మారిందని గ్రహించా. ఎందుకంటే, ఆ దేవదేవుడంతటివాడు, వార్నింగన్నా యివ్వకుండా, వచ్చికూచుంటే, చదవడానికొక దండకమైనా, కనీసమొక కందపద్యమైనా రాదే అని' అయినా ధైర్యం చేసి,

"శ్రీ కంఠచాపఖండన
పాకారిప్రముఖ...పాకారిప్రముఖా...
ఆ.. ఆ...ఆ"

అంటూంటే, శ్రీవారు మందస్మితులై,

"చాల్లే, నువ్వు మాత్రమేం చేస్తావ్, అది రానంటూంటే? సరేగాని యిటు కూర్చో" అన్నారు.

"రాకపోతే వూరుకుంటానా ఆరున్నొక్క రాగంలో సాగదీస్తాగాని" అందామనుకున్నాగాని, పుటుక్కున "పరిహాసాలా" అని వొకశాపం పారేస్తే, ఏడ్చి పోవలసివస్తుందని నోరు నొక్కుకున్నా.

శ్రీవారు గభాల్న మాట్లాడడం మొదలు పెట్టారు.

"మా శేవూ"

చుట్టూ చూశాను, "ఏమిటి?"

"అది కాదోయ్"

"మరి ఏదండీ"

"ఏయ్! నువ్వెక్కడో ఏదో లాగున్నావే? సరేకాని, మీవాళ్లు నన్నెంత యిబ్బందిపెడుతున్నారో చూశావా, నా కరుణను అలుసుగా భావించి?" అన్నారు భగవానులు సీరియస్‌గా.

"అవును," అన్నాను మరేమీ తోచక.

"అవునేమిటి నీ మొహం," అన్నారు విసుగుగా కాసేపు నిశ్శబ్దం. మళ్లా మ్రోగింది శ్రీవారి కంఠం. అది మేఘగర్జనములాగా లేకపోయినా, బొత్తిగా డప్పు మ్రోతలాగా మాత్రంలేదని చెప్పగలను.

"ఇదివరకు అర్చకులు పులిహోర, దద్ధ్యోజనమూ ఆరగింపు పెట్టేవాళ్లు. ఈమధ్య కాఫీ, యిడ్లీలలవాటుచేశారు. ఇప్పుడు ఆఫీసర్లు తనిఖీకి వస్తే, కాఫీ అలవాటు మాన్పించి, దద్ధ్యోజనాలు పెడితే - నీవే చెప్పు - ఎట్లా బ్రతకడం?"

"బ్రతక్క ఏంజేస్తావ్"

అని నాలుక చివరిదాకా వచ్చింది. పాపం, బ్రతకడం యిష్టంలేకపోయినా, చావడానికి వీలులేని గతి బట్టిందే యీ ఆదిమధ్యాంత రహితునికి అని నాకు చాలా యిదయింది. నిజంగా వొకగంట కాఫీకి ఆలస్యమయిందంటే నేను ఆగలేను. నాకు ఏం చేయడానికీ తోచక ఆయన చెప్పేది నోరుమూసుకుని వింటున్నాను.

"ఈమధ్య వొక అపరచార్వాకుడుదయించి, పత్రికలు గూడా వెలగబెడుతున్నాడని వింటున్నాను" యింకా చెప్పుకుపోతున్నారు. కాని, నేను వింటంలేదు నా మనస్సు, ఆ పత్రిక పేజీలు మూడా నాలుగా అన్న తర్కంలో మునిగివుంది. ఇంతలో హఠాత్తుగా వులిక్కిపడ్డాను శ్రీవారి ప్రశ్నతో.

"ఇదిగో, నీవు లేవని రాయటానికి నేనొక పత్రిక బెడితే నీ కెట్లా వుంటుందీ?"

నాకు నిజమేననిపించింది. ఆ విషయం తల్చుకుంటే వొళ్లు గగుర్పొడిచింది. కాదు మరీ, నేను చచ్చానసైనా కాదు. అసలే లేనని రాయడానికి వొక పత్రికా? ఏం విడ్డూరం? ఇది కలియుగమేనని నాకు నమ్మకం తోచింది. కాని, సానుభూతి ప్రకటనకైనా వ్యవధి యీయకుండా శ్రీవారు మొదలుపెట్టారు, గర్జిస్తూ.

"వాళ్ళను నామరూపాలు లేకుండా చేయగలను, కాని, వాళ్ళు నా బిడ్డలు. నేనే కోపగిస్తే వారికిక దిక్కేది? అన్నట్టు, నీవు మా అబ్బాయి క్రీస్తు చెప్పినది వినలేదా?"

నాపని సంకటంలో పడ్డది. విన్నట్టు జ్ఞాపకంలేదు. వినలేదంటే ఎటొచ్చి ఎటు బోతుందో అని చివరకు కష్టంమీద "ఊఁ" అన్నా.

"కలియుగంలో, యిదివరకంత కష్టం లేకుండా ముక్తిమార్గము సాఫుగా చేశాను. కాని, వొకసారి తలచుకొనే దిక్కయినా లేకుండాపోయింది. పాపం పెరిగిపోతున్నది. అయితే, నువ్వెప్పుడైనా భగవద్గీత చదివావా?"

ఇహ తప్పేట్టులేదు. అందుకని మొహం పగిలినా లక్ష్యపెట్టకుండా బోర్లపడ్డాను.

"దేవా! ఈసారి క్షమించండి. ఈవేళే షాపు కేగగలదు యీ పరమాణువు" అని మనవిజేసుకున్నాను.

శ్రీవారు చకితులై,

"ఇదేమిటోయ్! గీత చదివావా అంటే షాపంటావేం?" అని అడిగారు.

"అక్కడే గీత అమ్ముతారండీ. కొని వెంటనే చదువుకుంటాను."

భగవానులు ప్రసన్నముఖులై, "సరేలే! మీరందరూ నేను కనబడనని విసుక్కుంటారుగదా, బయటికొస్తే ఏమన్నా ఉందా? ఎన్నికల్లో డిపాజిట్లు దక్కించడమునుండి, బేబీ అజీర్ణమాత్రల సేలు యెక్కువ జేయడమువరకు నా పనే అవుతుందాయె. రాళ్ళల్లో, చెట్లల్లో, పుట్టల్లో దాగివుంటేనే చంపుతున్నారే—'స్వామీ! నా భార్య బరువు 600 పౌనులనుండి 100 పౌనులకు తగ్గిస్తే—పౌనుకు పది కొబ్బరికాయలు కొడతామని? ఇక, కండ్లెదట వుంటే—నువ్వే ఆలోచించు!'

నా కిందులో వొక్కటీ అబద్ధమనిపించలేదు. ఇంతలో వొక సంగతి తోచింది. ఇందాకటినుండి, యిదవుతున్నాడే, ధూపదీప నైవేద్యము లర్పించకపోయినా, అరకప్పు కాఫీయైనా పొయ్యకుంటే బాగుంటుందా అని వెంటనే చప్పున లేచి నిలుచున్నాను.

దేవదేవులు స్తబ్ధులై, "నన్ను లేచి పొమ్మనా నీ వుద్దేశ్యం?" అన్నారు.

నేను వెంటనే లెంపలేసుకొని, "తప్పు తప్పు, మిమ్మల్ని అనగలడా యీదాసుడు? పోయి కాఫీ తెద్దామని లేచాను" అన్నా బిత్తరబోయి.

శ్రీవారు పరమానందపడి, "భేష్! మనసులో మాట కనిపెట్టావోయ్. పో," అన్నారు.

తరువాత నేను తెచ్చిన కాఫీని మెచ్చుకుంటూ, "బలే '*strong*'గా ఉందోయ్! ఎవరు చేశారు?" అని అడిగారు.

(3గ-వ పేజీ చూడండి)

 శ్రీ భండారు పర్వతాలరావు 



# విజ్ఞాన వీధులు

## "డాక్టర్"



## 19. శిశువు పుట్టిచచ్చిందా; చచ్చి పుట్టిందా ?

దారిపక్కని ఏ తట్టలోనో, పెట్టి పారవేయబడ్డ శిశువు చచ్చిపోయి వుంటుందనుకోండి. పోలీసులు వచ్చి పంచాయతీ చేయిస్తారు. అప్పుడు వస్తుంది పై ప్రశ్న. చచ్చిపోయి పుట్టిన శిశువైతే విచారణే అక్కరలేదు ఎక్కడో పాతి పెట్టేయవచ్చును. పుట్టినప్పుడు బతికే వుండి, తరవాత చచ్చిపోయి వుంటే 'ఎవరు పారవేశారు?' అన్న పరీక్ష అవసరమౌతుంది. ఇది తెలుసుకోడానికి ఆ శిశువు ఊపిరితిత్తిని కోసి, ఒక ముక్కని నీళ్ళలో వేస్తారు. ఆ శిశువు బ్రతికేగాని. పుట్టియుంటే, ఏడ్చివుంటుంది. ఏడవడమువల్ల ఊపిరితిత్తుల్లో గాలి దూరి, ఆ తిత్తులు స్పంజిలాగు ఉబ్బుతాయి. ఈ ఉబ్బిన ఊపిరితిత్తి ముక్క నీటిలో తేలుతుంది. ఒకసారీ ఏడ్చిఉండకపోతే, ఆ ఊపిరితిత్తి ముక్క తేలదు. మునిగిపోతుంది.

## 20. ప్రతిధ్వని ఏమిటి ?

తిరుచ్చిరాపల్లికి సుమారు పదహారుమైళ్ళ దూరములో తిరువళ్ళరై అనే పల్లె ఉన్నది. ఆపల్లెలో పుండరీకాక్షస్వామిఆలయము ఉంది. ఆలయానికి ఒకపక్క విశాలమైన దొడ్డిఉంది. ఆలయప్రాంతములో నిలబడి ఏకేక పెట్టినా సరిగ్గా అదేకేక చక్కగా మళ్లీ వినబడుతుంది. ఎవరికేక మళ్లీ వారికి వెంటనే వినబడడము ఆ క్షేత్రములోని మహాత్తని పూజారి నేటికీ చెప్తాడు.

ఈ మహత్తు అక్కడమాత్రమే కాక, కోర అడుగులకు మించిన లోతుగల నూతుల లోనూ, ఆటస్థలాల అంచున లేచే గోడల వద్దా, మూడువైపులా ఆవరించిఉంటే కొండలదగ్గరా కూడా వుంటుందని మన అందరికీ తెలుసు.

చెరువులో రాయి వేస్తే ఆ అల్లరి, అన్నివేపులా గుండ్రంగా వ్యాపించే కెరటాలవల్ల చెరువు అంచులకు వ్యాపిస్తుందని మనకందరికీ తెలుసు. కాని అంచుకు చేరిన కెరటాలు బంతి తూలినట్టు మళ్ళీ వెనక్కి బయల్దేరి, రాయిపడినవైపు తిరిగి వస్తాయన్నది ఎందరికో తెలీదు. శబ్ద ప్రసారము తరంగగమనంవల్ల జరుగుతుంది కనక తరంగ ప్రసారము ఏరీతిగా జరుగుతుందో గమనిస్తే శబ్దమునుగురించి బాగా తెలుస్తుంది.




ఒకటోపటము పళ్లెములోని నీటిని సూచిస్తుంది. కేంద్రందగ్గర ఒక బిందువు రాలిస్తే, చుక్కల వర్తులాలుగా తరంగము వ్యాపించి అంచునుతాకి పరావర్తముచెంది మళ్ళీ వర్తులము చక్కగా ముడుచుకున్నట్లు కేంద్రానికి వచ్చి చేరుతుంది. పళ్లెము పెద్ద మైదానమై, అంచుదగ్గర గోడ లేచివుంటే, కేంద్రందగ్గర చేసిన శబ్దం నీటిపళ్లెంలో తరంగములాగే గోడదాకా వెళ్ళి, పరావర్తమై తిరిగి కేంద్రముదగ్గిరకి చేరుతుంది. ఈ ప్రతిధ్వని అసలు శబ్దానికి చక్కని




ప్రతిధ్వని. రెండో పటములో 'గోడ' వుంది. పళ్లెములో పలక పెట్టామనుకుందాము. ఇప్పుడు 'కే' దగ్గర శబ్దము చేశామనుకుందాము. (లేదా, బిందువు రాల్చామనుకుందాము,) తరంగము 'శత' గా వ్యాపించి గోడని తన్ని పరావర్తమై తిరిగి "ప్రతిధ్వ" అనే తరంగముగా ప్రతిధ్వనిస్తుంది. ఈ తరంగము 'కే' ని చేరినప్పుడు (అక్కడ మనముంటే) ప్రతిధ్వని వినబడు




తుంది. మూడోపటము పైని చెప్పిన పుండరీకాక్షాలయ ప్రాకారము 'యరలవ.' కేంద్రం దగ్గర చేసిన శబ్దం వర్తులాకారంగా (అసలు గోళాకారంగా) వ్యాపించి, ప్రాకారాన్ని తాకి పరావర్తమై 'కగ' 'చజ,' 'తట' లుగా తిరిగి కేంద్రాన్ని చేరుతుంది. కేంద్రము మూడుగోడలకీ సమదూరములో వుంటే, ప్రతిధ్వని 'కే' దగ్గరకి మూడువైపులనుంచీ ఒకేక్షణానికి చేరుతుంది కనక ప్రతిధ్వని గట్టిగానూ స్ఫుటముగానూ వుంటుంది. ఇంతకంటె బాగుండాలంటే అర్ధచంద్రాకారపు కొండనుంచి రావాలి ప్రతిధ్వని. నూతిలోంచి వచ్చిన ప్రతిధ్వని రెండోపటములోని 'ప్రతిధ్వ' తరంగములాగే వస్తుంది. అయితే అక్కడి ధ్వనితరంగానికి రెండోపటములో సూచించినంత వైశాల్యము అందుబాటులో లేదు. నూతిలో గాలి కదలుబాటు లేదు కనక శబ్దము నిరాటంకంగా పైకి వస్తుంది.




# పండగ సంతోషం

శ్రీ బొమ్మిరెడ్డి



పండగరోజున రావుగారుతా
పిండివంటలతో భోంచేసి
కొత్త యుడుపులను తొడిగిబజారుకు
కొడుకు నెత్తుకొనిపోయారు.

"ఏంతిది నాన్నా ఇవ్వాలందలు
కొత్తబత్తలను తొలిగాలు ?"
బజారుపరిస్థితి చూచి ముద్దుగా
పుత్రుడు రావుజి నడిగాడు.

రావుజికొడుకును ముద్దుపెట్టుకొని
"బాబూ యీ రోజునపండగ
అందుకనే సంతోషంగా
అందరుఉంటార"న్నారు.

"ఐతే ఈలోజున ఎవలూ
యాలవలా నాన్నా ?"
అన్నకొడుకునకు ఏడ్వరునాన్నా"
అంచు సమాధానించారు.

"అయ్యా ఒక కాసీ ధర్మం
చెయ్యండయ్యా" అంటూ
చిరుగుగుడ్డలతో చింపిరితలతో
వచ్చిన ఒక స్త్రీ అడిగింది.

"ఫోవే! డబ్బులు లేవ"ని రావుజి
ఆమెను కసిరీ పంపేరు.
దాన్నిజూచీ రావుగారితో
పుత్రుడు ఇల్లాగన్నాడు

"పండగలోజున ఎవలూ
యాలవగూలదుగా నాన్నా!
ఆ యమ్మామ్ కొక లూపాయ్
ఇయ్‌లాదా నాన్నా."

"వాళ్ళని దేవుడుఅల్లాగే
సృజించాడు వాళ్లెపుడూ
అట్లానే ఉంటార"ని
నవ్వుతు రావుజి అన్నారు.




# డాన్ క్వీక్‌సెట్

### పూర్వకథ

లామంచా అనే గ్రామానికి చెందిన డాన్ క్వీక్‌సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒక వీరుడు (నైట్)గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాన్‌టే' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకు తానే 'డల్‌సీనియా' అనే పేరు పెట్టుకొన్నాడు. ఆమె మన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివెర్రి ఆశలు చూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు. వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్వీక్‌సెట్ ఏవేవో సాహసకార్యాల చేయ బోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ఒకరోజు ఒక మైదానంలో వీరి విడిసివుండగా 'రోజినాన్‌టే' ఒక గుర్రాలమందలో కలియబోయింది. ఆ గుర్రాలను కాచే వాళ్లు దీన్ని కొట్టారు. డాన్ క్వీక్‌సెట్, శాంకోపాంజా వాళ్లమీద కలియబడ్డారు. వాళ్లు దుడ్డుకర్రలతో వీళ్లిద్దరికీ దేహశుద్ధిచేసి పంపారు. తరువాత యిద్దరూ ఒక హోటల్లోకివెళ్లి, అక్కడివాళ్లుచేసిన పరిచర్యలన్నీ స్వీకరించారు. వంటిమీది గాయాలన్నీ మానాక, యిద్దరూ ఆ హోటల్ యజమానికి డబ్బుయివ్వకుండా బయపడాలని చూశారు. డాన్‌క్వీక్‌సెట్‌మాత్రం ముందుగా పారిపోయాడు. హోటల్ యజమాని శాంకోపాంజాగాడిని పట్టుకు చావ చితకబాదిచి, గుడ్డలతో ఉంగగాచుట్టి గాడిదమీద కుదేసి తరిమేశాడు.

శాంకో పాంజా, యజమాని పోయినవైపుకే, తన గాడిదను కూడా పోనిస్తున్నాడన్నమాటే కానీ, వాడి మనస్సు మాత్రం ఏమీ బాగాలేదు. ఆ హోటల్‌లో అన్ని తన్నులు తిన్నందుకు వాడికి తల తీసేసినంత అవమానంగా వుంది. తన జీవితం యింత నవ్వులపాలు అయిపోయినందుకు, వాడికి ఎందులో నైనా పడి చద్దామా అని కూడా అనిపించింది.

డాన్ క్వీక్‌సెట్ గారు యిది గమనించారు. నమ్మినబంటు యిలా ముఖం వేలవేసుకువుంటే ఆయనకు మాత్రం ఏమంత బాగుంటుందీ? వీణ్ణి కాస్త మాటలతో హుషారుచేస్తేనైనా మనిషి తేరు కుంటాడేమో నన్న ఆశకొద్దీ, తన ధోరణి మొదలు పెట్టాడు.

"శాంకో! ఇందసత్యముకానీ, అతిశయోక్తికానీ యిసుమంతయు లేదు. ఇదంతయు మాంత్రికుల ప్రభావమే. మన మిప్పుడు వదలివచ్చిన ఆకోట యున్నదే— దానిని ఎవరో మాంత్రికులు తమ వశమొనర్చుకొని యున్నారు. నీవట్ల అమానుషముగా ప్రవర్తించిన వారు మనుష్యులు కారు; అవి ఏ మాంత్రికుడో ప్రేరణ చేసి మనపైకి పంపిన భూత ప్రేతములు. అవియే నిన్ను హింసించినవి. అది యట్లుండనిమ్ము! ఆ భూతముల వాతబడి నీ వారీతిని హింసింపబడుచుండ, నే నెంత ప్రయత్నించిననూ నీకు సహాయ మొనరింపలేకపోయి తిననిన, అదియును మంత్రప్రభావమే గదా! ఆమాంత్రికులు నాపైగూడ మంత్రములను ప్రయోగించి, నన్ను అచ్చటినుండి కదుల నశక్తునిగా ఒనరించిరి. ఆ మాంత్రికులెవరో, ఆ మంత్రప్రభావ మెట్టిదో కానీ, నిన్ను హింసించినవారి గుండియలు చీల్పవలెనని నామనస్సు ఎంత వేగిరపడిననూ, నా అవయవములు నా స్వాధీనములో లేకుండాపోయినవి కదా! ఏమి చెప్పుదు శాంకో! నే నారీతిని మంత్రప్రభావమునకు లోబడి మిన్నకుండవలసివచ్చినది కానీ, లేక పోయినచో, నిన్ను హింసింప సాహసించిన ఆ ముష్కరులకు, మరి పది జన్మములవరకును జోలికి రాకుండు నట్లు బుద్ధి చెప్పియుండువాడను. వీరాభిషేకము చేయించుకొని అల్పమానవులను నేను నాచేతితో తాకరాదను నియమ మున్నప్పటికినీ, నీకై, ఆ నియమమును పాటించక, ఆ దుండగీండ్రను కడతేర్చి యుండుదును కదా!"

ఈమాట అనేసరికి శాంకోపాంజాకు పట్టరాని కోపంవచ్చింది. "వీరుడుఅయ్యేది, కాకపోయేదీ,— నా వొంట్లో ఏమాత్రపు ఓపికవున్నా, నేనే వాళ్లపని

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

పట్టివుండేవాణ్ణి." అన్నాడు—శాస్త్ర విసురుగానే. "మీరేమో వాళ్లు మనుష్యులుకాదనీ, దెయ్యాలూ భూతాలూ అనీ అంటున్నారుకానీ నాకంటికీ, నావంటికీ వాళ్లూ మనలాటి మనుష్యులేననిపించింది. నన్నా వరసను వాళ్లు చావ బాదుతుంటే, మీరు నా దగ్గరకైనా రాలేకపోయారంటే అందుకు కారణం మంత్రశక్తిమాత్రం అయివుండదు. ఆచాయల్లో ఎక్కడా మీరు లేకుండా పోవటానికి యింకేదైనా నమ్మదగిన కారణం మీరు కనిపెట్టగలిగివుంటే బాగుండేది. నాకు అసలు యిదిఅంతా చూస్తూంటే—మనకీలాటి దురవస్థలు యింకా ఎన్నో రాసిపెట్టివున్నాయనిపిస్తున్నది. మనకీ దుష్టశిక్షణలూ వద్దు; శిష్టరక్షణమూ వద్దు; - వచ్చినదారినే మనపల్లెకు పోయి, యింటిపట్టున వుండిపోతేనే బాగుంటుంది." అన్నాడు మూతిమూరెడు పొడుగుజాపి.

ఈ మాటలు వినేసరికి డాన్ క్విక్‌సెట్ గారి బుర్ర గిరగిరా, గిరగిరా తిరిగింది.

"ఈ శకునపక్షి నా కెక్కడ దాపురించాడురా" అని లోలోపలే మండిపడ్డాడు. అయినా వీరుడుగా చెలామణి అవుతూ, యింతదూరమూ వచ్చాక, వీడి మాటలకు లెక్కచేసి వెన్నుచూపితే ఎంత నగుబాటో మనస్సులోనే వూహించుకొన్నాడు. ఇంతటితో తెగతెంపులు చేసుకొని వీణ్ణి వెళ్లిపొమ్మందామా అంటే, మళ్ళీ తనకు బంటు ఎవడు దొరుకుతాడు? వీడు రావటానికే అంత యమయాతన పడ్డాడు కదా! అధైర్యపడటం వీరుడి లక్షణంకాదని మరొకసారి జ్ఞాపకం తెచ్చుకొని గొంతు సవరించుకొని—

"ప్రియమైన నా శాంకో! నీ అజ్ఞానమును చూచినకొలది నాకు మతిపోవుచున్నది. వీరుడుగా వ్యవహరించుట అనిన అది, కొన్ని ప్రమాదములతో కూడుకొనిన పని అని ఎరుగవా? ఒక్కొక్క సమయమున వీరుడైనవాడు ప్రత్యర్థి సమూహముల నడుమ తగుల్కొని నానా యాతనలు పడవలసివచ్చును. అట్లని వీరుడుగా వ్యవహరించబోవుటయే కూడదనిన అందు వివేకమున్నది? మాటలు కేయినేల...అనతి కాలమునందే మన మాచరింపబోవు కార్యములు ఎంత మహత్తరము



లైనవో నీవే గ్రహింపగలవు. ధైర్యమును కోల్పోయి పిరికిపంద వనిపించుకొనక ఓపిక పట్టియుండుము."

ఇంకా ఏమిచెపితే వీడికి బాగా నచ్చుతుందా అని ఆలోచిస్తూ, దిక్కులు చూడటం మొదలుపెట్టాడు. అల్లంత దూరాన రోడ్డుమీద దుమ్ము ఆకాశమంత ఎత్తున లేచి, కదులుతున్న మేఘంలా యీాయన కంటికి కనిపించింది. కదులుతున్న మేఘం కంట పడేసరికి, ఆతని నరాలలో నెత్తురు వేడెక్కింది. నుదుటికి అడ్డంగా కుడిచేయి పెట్టుకొని, గుడ్లు పెద్దవిచేసి ఆదిక్కే పరీక్షగా చూశాడు. ఆ మేఘం తమవైపే వస్తున్నట్లు తోచింది. ఇందులో ఏదో పెద్ద రహస్యం వుండితీరాలను కొన్నాడు. శాంకో పాంజాను పేరు పెట్టి పిలిచి:

"యుద్ధోన్ముఖమైన గొప్ప సేనాసమూహమేదో

యీదిశకే వచ్చుచున్నది; కాంచితివా శాంకో? వారి హయముల పాదఘట్టనములచే ధూళి ఎంత దట్టముగా పైకెగసినదో పరికించితివా?" అని హెచ్చరించాడు.

ఇంతసేపూ వీరులు సలిపే యుద్ధాలు ఎంత భీకరాలో వివరిస్తూవున్నాడుకదా! ఇంతలోనే యింత పెద్ద దండు యీ వైపుకే వస్తూవున్నందువల్ల, తా నింతవరకూ చెప్పినవిషయం ఋజువుచేసే అవకాశంకూడా లభించినందుకు డాన్ క్విక్‌సెట్ లోలోపలే చాలా సంతోషించాడు.

శాంకోపాంజా కూడా అంత పరీక్షగానూ, ఆవైపే చూశాడు. అంతటితో ఆగక, యింకోవైపుకు కూడా తిరిగిచూశాడు. అటువైపునకూడా యిలాగే దుమ్ము పెద్ద మేఘంలా ఆకాశం ఎత్తున ఎగురుతూ వుండటం యితనికంటపడింది.

"మీరు చెప్పేదే నిజమయితే, మనవైపుకు వస్తున్న సైన్యసమూహం ఒకటికాదు; యిటువైపు నుంచీకూడా మరొకదండు వస్తున్నట్లున్నది. "అంటూ తనకుతోచిన అభిప్రాయాన్ని బయటపెట్టాడు.

"ఆఁ! అటులనా!!" అంటూ డాన్ క్విక్‌సెట్, శాంకోపాంజా చూపెట్టినవైపుకు తిరిగి పరీక్షగా చూశాడు. శాంకోపాంజాకైతే వణుకు పుట్టుకు వస్తున్నది కానీ, యీయనకుమాత్రం, యింత త్వరలోనే తన ప్రతాపం కనపరిచే అవకాశం వస్తున్నదికదా అని పించి ఎగిరి గంతులువెయ్యాలన్నంత సంబరంవేసింది.

ఈ రెండుసైన్యాలూ ఢీకొంటాయని, ఆ సంరంభంలో ఎందరో పేరుప్రఖ్యాతులున్న యోధానయోధులు తనకళ్ళఎదుటనే హతమారిపోవటం తప్పదనీ ముందుగానే వూహించుకొన్నాడు.

ఈయన యీ వరుసను రకరకాలుగా వూహాలు అల్లుకొంటూ పరవశుడైపోతుంటే, అవతల శాంకో పాంజాకు పట్టుకున్న గుండెబెదురు అంతకంతకు ఎక్కువకాసాగింది. "స్వామీ! స్వామీ! ఆ మేఘాలు

యిటే వస్తున్నాయి. అంతకంతకూ మనకు దగ్గిరగా కూడా వస్తున్నాయి. ఇప్పుడు ఎలాగు? మనం ఏం చెయ్యాలి?" అంటూ వెర్రి మొఖం పెట్టేశాడు.

"డాన్ క్విక్ సెట్ మందహాసం చేస్తూ—ఏమి చేయవలె నందువేమి? ఆ రెండు సైన్యములలో ఏ సైన్యము బలహీనముగా నుండునో, వారిపక్షమున జేరి మనమునూ పోరాడవలసివున్నది." అన్నాడు. అప్పటి కప్పుడే ఆయనకు వీరోచితమైన వుద్రేకం వచ్చేసింది. ఆ వుద్రేకంలో ఏమిటేమిటో మాట్లాడుతూ, యిప్పుడు జరుగబోయే యుద్ధంలో ఫలానిఫలాని యోధుడు పోరాడబోతున్నాడనీ, వాళ్ళలో ఫలానిఫలానివాళ్లు మృత్యువాత పడబోతున్నారనీ ఒకగుక్కలో చెప్పేశాడు.

అంతూపొంతూలేకుండా ఆయన ఏమిటో ఆ వరసను చెప్పుకుపోతుంటే, శాంకోపాంజా—కప్పకు మల్లే—నోరు తెరుచుకు చూస్తున్నాడు. డాన్ క్విక్ సెట్ గారి కేరింతాలన్నీ పూర్తిఅయ్యాక, కొంత సేపటికి తేరుకొని "అయితే స్వామీ! మీరంత సేపూ చెప్పిన ఆ యోధులు కానీ, ఆ రాక్షసులుకానీ యీ సైన్యంలో వున్నట్లు నాకు తోచటంలేదే" అని శాంకోపాంజా అన్నాడు.

"ఏమేమీ! యోధులు, రాక్షసులు ఎవ్వరునూ కనుపించుటలేదా? అశ్వ ఘోషలు, రణభేరీ నినాదములు వినవచ్చుటలేదా?" డాన్ క్విక్ సెట్ గుచ్చి గుచ్చి అడిగాడు.

"ఏమోనండీ, మీరు చెప్పేవి నాకేమీ వినిపించటంలేదు. ఏవో కొన్ని గొఱ్ఱెలఅరుపులుమాత్రం వినిపిస్తున్నాయి. అంతే." నిజంగానే యింకేమైనా ధ్వనులు వినిపిస్తున్నాయేమోనని శాంకోపాంజా మళ్ళీ అతి శ్రద్ధగా విన్నాడు. గొఱ్ఱెల అరుపులకుమించి వేరే ఏధ్వనీ అతని చెవులబడలేదు. నిజంకూడా అంతే! గొఱ్ఱెల అరుపులకుమించి మరి ఏ రణగొణధ్వనీ వినిపించటంలేదు. ఇటువైపునుంచీ కొన్ని, అటువైపు నుంచీ కొన్ని గొఱ్ఱెలమందలు ఆ మైదానంమీదకు వస్తున్నాయి, ఈ మందల ముందూ, వెనుక గొఱ్ఱెల కాపర్లు నడుస్తున్నారు. ఇన్ని గొఱ్ఱెలూ కదులుతుంటే, దుమ్ము దట్టంగాలేచి, డాన్ క్విక్ సెట్ కంటికి కదులుతున్న మేఘంలా కనుపించింది.

ఆ మేఘం దగ్గరకు వస్తున్నకొద్దీ, అందులో

నుంచీ గొఱ్ఱెల ఆకారాలూ అవీ అంతకంతకు సుస్పష్టంగా కనుపిస్తూనేవున్నాయి. అయినా సరే—డాన్ క్విక్ తనకంటికి కనుపిస్తున్న గొఱ్ఱెలమందను గొఱ్ఱెలమందని ఒప్పుకోక అదేదో పెద్ద సైన్యసమూహమే అనుకున్నాడు. 'అది గొఱ్ఱెలమంద బాబోయ్' అంటూ శాంకోపాంజా ఎంతగా చెవినియిల్లుకట్టుకు పోరి చెప్పుతున్నా, డాన్‌క్విక్‌సెట్ ఆ మాటలేమీ వినిపించుకోకపోగా, "నీవంటి పిరికిపంద యీ ముద్యోడు జగంబులందు మరెచ్చటనూ లేడు. భయవిహ్వలత్వమునకు లోనైవున్న నీ కంటికి సైన్యసమూహములు సైన్యసమూహములుగా కాక, గొఱ్ఱెలమందలవలె కన్పట్టుటలో అబ్బురమేమున్నది! ఆవలకు బోయి నిలువుము. నే నలుపనున్న యీ యుద్ధక్రీడయందు నీ సాయము నా కిసుమంతయు అక్కర లేదు. నీవిచ్చటనే యుండి నే నొంటరిగా నలుపంబోవు యీ క్రీడావినోదముల కన్నులారగాంచి నీ జన్మమును తరింపచేసుకొనుము." అన్నాడు. ఆ వాక్యం ముగించీ ముగించకముందే డాన్ క్విక్‌సెట్ తన గుర్రాన్ని అదిలించటమూ, అది గంతులువేస్తూముందుకు పరిగెత్తటమూ జరిగిపోయింది.

శాంకోపాంజా యిప్పటివరకూ పొందిన అనుభవాలమూలంగా, యిప్పుడు జరుగబోయేది కూడా ఏతీరున వుంటుందో ముందుగానే తెలుసుకోగలిగాడు. అందుకని—దూరంగా పోతున్న తన యజమానిని బిగ్గరగా పిలిచి "మీకాళ్లు పట్టుకు వేడుకొంటాను. క్షణంసేపు నిలవండి. అవి సైన్యాలు కావండీ బాబూ! గొఱ్ఱెలు, గొఱ్ఱెపిల్లలు తప్ప వేరే ఏవీ యిటువేపు రావటం లేదండీ" అని నెత్తిన నోరు పెట్టుకు అరిచాడు. ఆయన ఆమాట వినుపించుకొంటేనా!

డాన్ క్విక్‌సెట్ ఏకాఏకిని పోయి ఆ గొఱ్ఱెల మంద నట్టనడుమ తన గుర్రాన్ని ఆపాడు. ఇలా విసురుగా యీ గుర్రం, మందలోకి వచ్చి పడేటప్పటికి ఎక్కడి గొఱ్ఱెలు అక్కడ చీలిపోయి, అన్నీ తలాఒక దిక్కు దౌడుతీశాయి. మందను యీ విధంగా చెల్లాచెదరుచేసిపారేసినందుకు ఆ గొఱ్ఱెల కాపరులకు యీ వీరుడిమీద మాంచి కోపం వచ్చింది. వాళ్ళకు వచ్చిన తిట్లన్నీ యాయనమీద ప్రయోగిస్తూ, రాళ్లు పుచ్చుకు వెంటపడ్డారు. ఆయనమీద రాళ్లవర్షం జోరుగా కురిసింది. ఆ దెబ్బలకు ఆగలేక డాన్ క్విక్‌సెట్‌గారు గుర్రంమీదినుంచీ కిందికి దొర్లిపోయారు. అలా కొంతసేపు గడిచాక పారిపోతున్న గుర్రం వీపుమీద మనిషి లేకపోవటం గొల్లవాళ్లు గమనించారు. డాన్ క్విక్‌సెట్‌గారు చచ్చిపోయాడేమోనని వాళ్లకు ఒక్కమారుగా భయం వేసింది. అందరూ గుట్టు చప్పుడు

కాకుండా, మందను మళ్లేసుకొని ఆ చుట్టుప్రక్కల ఎక్కడా కనుపించకుండా పోయారు.

దూరంనుంచీ యిదంతా చూస్తున్న శాంకో పాంజా రొప్పుకొంటూ రోజుకొంటూ తన యజమాని దగ్గిరకు పరుగెత్తుకు వచ్చాడు.

"శాంకో ! నాపై పగబూనిన ఆ మాంత్రికు డెవడో మహాఘటికుడివలె నున్నాడు. అతడు ఎంతటి ప్రతిభావంతుడు కాకయున్న, ఆ సైన్య సమూహములను తృటిలో గొర్రెలమందగా మార్చి వేయగలడు" అంటూ డాన్ క్విక్ సెట్ గారు తనకు తోచిన అనుమానాన్ని వెళ్ల బెట్టాడు. శాంకో పాంజా ఏదో చెప్పబోయాడు. డాన్ క్విక్ సెట్ వాణ్ణి మాట్లాడనీయకుండా మళ్లా తనధోరణి అందుకొని నీ కింకనూ సందియమున్నచో, ఆ గొర్రెల మందలను నీవొకింత దవ్వు అనుసరించిచూమ్ము. అవే గొర్రెల మందలు అంతలో సైన్యసమూహముగా మారి తీరె డిని. అందు సందియము లేదు....అది అట్లుండనిమ్ము! నీవొకసారి నా దగ్గిరకు వచ్చి, నా నోటియందు యింకనూ ఎన్ని పళ్లు మిగిలివున్నవో ఒకసారి లెక్కించి చెప్పుము. నాకు మాత్రము, ఒక్క పన్ను అయిననూ మిగుల లేదనియే తోచుచున్నది." అన్నాడు.

తానంత చెప్పినా వినిపించుకో కుండా దుడదుడా పరిగెత్తినందుకు యీయనకు పళ్లు వూడి తగిన శాస్తి అయిందని శాంకో పాంజా సంతోషించాడు యజమాని తన పళ్ళవిషయం కొంచెం చూసిపెట్ట మని అంత గోల పెట్టుతున్నా, వీడు అదేమీ వినిపించుకోకుండా, తన గాడిద 'డాపుల్' వీపు నానుకు నిల్చొని, ఏదో దీర్ఘంగా ఆలోచి స్తున్నాడు. వీడి వాలకం చూసి, తనకు దెబ్బలు తగిలినందుకు వాడు కుమిలి పోతున్నట్లున్నాడు గాబో లు ననుకొన్నాడు, డాన్ క్విక్ సెట్. "ప్రియమైన శాంకో ! నాపాటుకు నీవు వగ జెందెద వేలనోయి?" అన్నాడు; ఎంతో వుదారంగా.

శాంకో పాంజా మాత్రం యింకా దెప్పిపొడిచే ధోరణి మాన లేదు. "అవును; మీరు పడ్డ పాట్లతో నాకేమి పనివుందిలెండి. దగ్గిర వున్న డబ్బుసంచి పోగొట్టుకొన్నా, ఆవరసను ఆహోటల్లో వాళ్లు గొంగళిలో చుట్టబెట్టి బంతిని తన్నినట్లు తన్నినా ఆ పాట్లన్నీ పడ్డది నేనేకానీ, మరెవ్వరూ కాదే!" అన్నాడు.

"ఏమేమీ ! డబ్బుసంచి కూడా పోయినదా? మనకిక తిండి దొరుకదా ?" అంటూ డాన్ క్విక్ సెట్ గారు విస్తుపోయారు.

"తిండిమాట కేమి లెండి. ఈ పొలాల్లోనే ఏవో కందమూలాలు దొరకక పోతాయా ! మీలాంటి వీరులు వాటినే పీక్కుతింటారుగా" అన్నాడు శాంకో పాంజా వెక్కిరింపుగా.

"వీరులు కందమూలములు భక్షింతురని నేను నుడివినమాట సత్యమే. ప్రస్తుతము నాకా కంద మూలములకంటెను రొట్టెముక్కలు తినవలయు ననియే అనిపించుచున్నది. కనీసము వుప్పులో నూర బెట్టిన చేపలు దొరికిననూ చాలును. కనుక, ఓశాంకో, మన మెట్లయిననూ యీ నిర్జనస్థలమును వీడి ఎందైన బోవుదము. తినుటకు ఏదైన లభించవచ్చును"

(ఇంకావుంది)

# బైజు బావరా

అక్బరు పాదుషా సాహిత్య కళాపోషకుడు గాను, గానప్రియుడుగాను పేరు పొందినవాడు. అతని ఆస్థానంలో తాన్‌సేన్ అనే అమరగాయకు డుండేవాడు. అతని గానమంటే పాదుషా చెవి కోసుకొనేవాడు. సుమారు పది పదేను సంవత్సరాలు, తీవ్రమైన కృషిచేసి, కళాసరస్వతినారాధించి, అపూర్వమైన గానకళా నైపుణ్యాన్ని కంఠమాధుర్యాన్ని సంపాయించుకొన్నవాడు తాన్‌సేన్ !

అధికారాలు చేతుల్లో వుండే ప్రభువులు తమతమ యిష్టాయిష్టాలను అనుసరించి, కఠిన శాసనాలు చేస్తూండటం ఆకాలంలో పరిపాటి. రసికుడూ, ప్రజారంజకుడూ అయినప్పటికీ అక్బరు ఆగ్రా నగరంలో, తాన్‌సేన్ గానంతప్ప మరెవ్వరి గానం వినబడరాదంటూ, మూర్ఖపు శాసనం ఒకటి చేశాడు. అల్లా నగరంలో, యే మారుమూల యెవ్వరు పాడినా కచ్చేరీలు చేసినా, వారు తప్పనిసరిగా, తాన్‌సేన్‌తో పోటీచేయాలి. ఆ పోటీలో ఓడిపోతే మరణదండన!

ఐనా దేశం నలుమూలల్నుండి గొప్ప గొప్ప విద్వాంసులు వచ్చి తమ ప్రాణాల్ని గోల్పోయి ఆగ్రా నగర రాజద్వారానికి బలి అయ్యారు. తాన్‌సేన్ గొప్ప గాయకుడే అయినా, అతని గర్వం ప్రజలకు సహింపరానిదయ్యింది.

ఇలా వుండగా ఒకనాడు కొందరు సన్యాసులు భగవన్నామ సంకీర్తనం చేసుకొంటూ, ఆగ్రా మహానగరంలో ప్రవేశించారు. వారు కేవలం దైవచింతలోనే పాటలు పాడుకొంటున్నారు గాని, నగర శాసనధిక్కారం చేసే ఉద్దేశం వారికి ఎంతమాత్రమూ లేదు. ఐతేనేం, రాజాజ్ఞకు తిరుగేమున్నది? రాజభటులు వారిని బంధించి, పాదుషా యెదుట హాజరు పరిచారు. జగద్రక్షకుడనే బిరుదు వహించిన అక్బరు పాదుషా యీ విషయంలో ప్రాణభక్షకుడుగా మారాడు. తాన్‌సేన్‌ను అవమానపరిచిన వీరందరినీ కొఱత వేయాల్సిందే నన్నాడు. ఆ సన్యాసుల్లో బొత్తిగా పసివాడైన "బైజుబావరాను" మాత్రం వదిలివేశారు.

"బైజూ" పసిహృదయం, తన తండ్రి, అనుచరుల అకాలమృతికి యెంతగానో విలపించింది. ఊరడింపులేని అతని దుఃఖము, ద్వేషంగా మారిపోయి, పాదుషా నిర్దయత్వానికి, తాన్‌సేన్ గర్వానికి ప్రతిక్రియ చేసి తీరాలనే పట్టుదల ఆతనిలో ఎక్కువైంది.

ఆతని హృదయం ఆవిధంగా ప్రతీకారవాంఛతో దగ్ధమౌతూ వుండగా, బైజూకు, స్వామీ శంకరానందుడనే సన్యాసి తారసిల్లాడు. బైజూ ఆయన పాదాలపై బడి, సగతంతా చెప్పి, పగతీర్చుకొనే శక్తిని ప్రసాదించమని అర్థించాడు. అందుకు శంకరానందుడు; "నాయనా; నీకు తండ్రియందుండే ప్రేమాసక్తులే నీలో యింత సాహసాన్ని కలిగించవచ్చును గాక, కార్యసాధన కష్టతరం బాబూ; తాన్‌సేన్ సామాన్యుడు గాడు. అతని జయించటం నీవంటి పసివానికెలా సాధ్యమౌతుంది ! విద్యను విద్యేకాని వేరొక్కటి జయించలేదు" అని అనేక విధాల హితబోధ చేసి, బైజూమనస్సును మార్చజూచాడు. కాని బైజూ బావరా అందుకు యెంతమాత్రమూ యిష్టపడకపోగ, మరింత పట్టుపట్టాడు. శంకరానందుడా బాలుని పట్టుదలకు ముగ్ధుడై పోయాడు.

బైజూ, పన్నెండేళ్లు రాత్రింబవళ్లు సాధనచేసి, అపూర్వగాన కౌశల్యాన్ని పొందగలిగాడు. శంకరానందుడు మహా సంతోషంతో బైజూనాశీర్వదిస్తూ "బైజూ, పరిపూర్ణుడవయ్యావ్, అయితే యీ నీ విద్యతో, యెవ్వరికీ యెటువంటి కీడు తలపెట్టకు సుమా! అలా చేసిననాడు నీవు సరస్వతిని హింసించినట్లే అవుతుంది. అలా చేయనని నాకు హామీయియ్యి నాయనా! అదే నువ్వు నాకీయవలసిన గురుదక్షిణ" అన్నాడు.

బైజూ నివ్వెరపోయాడు. తెప్పరిల్లి, "ఐతే స్వామీ అనేక

శ్రీ పిల్లా కృష్ణమూర్తి

కష్టనష్టాలకు ఓర్చి సాధించిన యీ విద్య దేనికి ?'' అని అడిగాడు.

పరోపకారానికే! అని శంకరానందుడు అనగానే బైజూ హృదయం పూర్తిగా నిర్మలమైంది. తనవిద్యను తాను పూర్తిగా గౌరవించగలనని హామీ'' యిచ్చాడు.

"బైజూ బాబరా'' ఆగ్రా నగరం ప్రవేశించాడు. ఆనాడు తెలియక నగరంలో గానం చేసిన బైజూ యీనాడు తెలిసి, నగరమంతా గానకచ్చేరీలు చేయనారంభించాడు. ఈసంగతి తెలిసీ తెలియగానే రాజభటులాతన్ని బంధించి తాన్‌సేన్ సౌధంముందుగా నడిపించుకొంటూ పోయి రాజబాట పట్టించారు. "ప్రాణాలమీద తీపి లేదాయేం ?'' అన్నాడు తాన్‌సేన్ గర్వంగా మేడమీదనుంచీ చూస్తూ "ఏమో, ఎవరిగతి యేమి కానున్నదో!'' అన్నాడు బైజూ అంతకంటే గర్వంగా!

ఊరి అవతలి ఉద్యానవనంలో పురజనుల సమక్షంలో పోటీ యేర్పాటు చేయబడింది. ఊరి జనమంతా ఆ పందిరిలో కిటకిటలాడుతూ కిక్కిరిసి పోయారు. బైజూ తాన్‌సేన్‌లు ఒకరి కెదురుగా ఒకరు ఉచిత ఆసనాలమీద కూర్చున్నారు. తాన్‌సేన్ తన శక్తినంతా వినియోగించి, బైజూపై ప్రశ్నల వర్షం కురిపించాడు. బైజూ తాపీగా తడుముకోకుండా, జవాబులిచ్చాడు. తర్వాత సితారా పుచ్చుకొని, బైజూ తనగానం వినిపించసాగాడు. అతని గానానికి ప్రజలంతా మంత్రముగ్ధులైనారు. అక్బరు చక్రవర్తి కూడా తన్మయుడై పోయాడు. లేగదూడలకు మల్లే అంతా తలలు వూపుతూ అతని గానవాహినిలో తేలియాడారు. అందరూ అలా పరవశులై వుండగా, ఎక్కడినుంచో ఒక లేడిపిల్ల చెంగు చెంగున ఎగురుకొంటూ అతని చెంతకు వచ్చి శిలాప్రతిమకుమల్లే నిలిచి చెవులు రిక్కించి అతని దివ్యగానం వింటూ వుండిపోయింది. అంతట బైజూ పాట ఆపి దానిమెడలో ఒక పూలమాల వేశాడు. అది త్రుళ్లిపడి మరుక్షణంలో మాయమైపోయింది.

తాన్‌సేన్ తనూ పాడడం మొదలుపెట్టాడు. అతడు ఎన్నివిధాల ప్రయత్నించినా తిరిగి ఆ లేడిని ఆకర్షించలేకపోయినాడు. ఎందుచేతనో అతని గానం ప్రజలను కూడా బైజూగానమంతగా ఆకర్షించలేకపోయింది. విసిగిపోయి ఆఖరున తాన్‌సేన్ తప్ప

(38-వ పేజీ చూడండి)



# దెబ్బతూ దెయ్యం

"చుబ్బులు తాతా! ఒక కత సెప్పూదూ'' అన్నాడు ఆరేళ్ళ వెంకిగాడు, నోట్లో వేలేసుగుని.

అది గజపతినగరం. చంపావతి యేరు దానిపొడుగునా గలగల ప్రవహిస్తూంది. వెంకటాపురం రేవు కెదురుగా వొకపెద్ద మఱ్ఱిచెట్టుంది. వేసవి సాయంత్రాలలో చల్లగాలికి ఆ చెట్టుకింద సుబ్బులుతాత చింకిచాప పరుచుకుకూచునేవాడు.

ఆవేళ రోజూమాదిరిగా పదిమంది పన్నెండేళ్లలోపు ఆడ,మగ, నత్త. నావ, అతనిచుట్టూ చేరేరు. పుటికలమ్మే కోమటికొడుకు వెంకటరెడ్డి, మంచినీళ్ళ రామయ్య కూతురు లక్ష్మి, మునసబుకొడుకు సుబ్బన్న, మేజస్ట్రేటు కచేరీ హెడ్ గుమాస్తాకొడుకు చిరంజీవి, యాతపైడితల్లికొడుకు వెంకిగాడు యిత్యాదులు సుబ్బులుతాత ఆటవిడుపు పరివారం.

'అయితే యిలా దగ్గరసా జరిగి కడియంకట్టి కూచోండి, మంచికధ చెపతా...'

పిల్లలు దగ్గరగా జరిగారు. 'ఏంకధ చెప్పమన్నారు?' అంతా గొల్లుమని పురమాయించేరు. చంద్రుడింకా అగుపించడంలేదు. కానీ, ఆకాశపు వెలుతురుకు యేటిపొడియిసక మెరుస్తూంది.

'ఆగండాగండి. మీ రెవ్వరూ అడిగిందికాదు. ఒక మంచి గమ్మత్తయినకథ చెపుతా'

అంతా నిశ్శబ్దం. ఆతృతగా చూస్తున్నారు. సుబ్బులు తాత కాలం మళ్ళినవాడు. అనుభవంకలవాడు. చెట్టకింద ప్లీడరీచేసి జీవితమంతా బ్రహ్మచారిగా గడిపినవాడు. పిల్లలు కథ చెప్పమన్నప్పుడు, తనజీవితంలోతగిలిన యేదో అనుభవాన్నే కథలాఅల్లి చెప్పేవాడు.

'దెయ్యాలపంతులు కథ చెప్పనా?' అన్నాడు. దిశమొలతోవున్న వెంకిగాడు సగంలేచి 'ఓలమ్మో' అన్నాడు భయంతో బిక్కజచ్చి.

'ఫరవాలేదురా వెంకిగా. ఈ కథలో దెయ్యాలు రావురా. వెంకిగాడు గొంతికిలా కూచున్నాడు గుండె కొంచెం సర్దుకుందిగాని, అలాగే జరిగిజరిగి తాతను తాకినంత దగ్గరగా చేరేడు.

'ఏమర్రోయ్! కథ బాగా విని 'ఊ' కొట్టాలి.' అంతా అలాగే అన్నారు.

'పదేళ్లకిందట యీ మఱ్ఱిచెట్టు పక్కవున్న యింట్లో వీరప్పరాజుఅని వొక దెయ్యాలపంతులుండేవాడు.'

'అంతే యేటండీ తాతా?' అని ప్రశ్నించేడు పదేళ్ల కోమటి వెంకట రెడ్డి.

'అంటే-యెవరికైనా దెయ్యాలు పడితే కుదురుస్తాడన్నమాట'

'ఓలమ్మో. దెయ్యాలే!' వెంకటరెడ్డి హడిలి తాతదగ్గరగా చేరేడు.

'ఓరి...పిరికీ! తాతని చెప్పనీరా' అన్నాడు మునసబుకొడుకు సుబ్బన్న.

'ఆ వీరప్పరాజు దెయ్యాల్ని కుదురుస్తా ననేవాడు. మంత్రాలు లేవూ, మన్నూ లేవూ. తను మాత్రం దెయ్యంలాగే వుండేవాడు.'

'తాతగారూ! దెయ్యా లెలాగుంటాయండీ' అని ప్రశ్నించేడు చిరంజీవి.

'దెయ్యా లెలావుంటాయేమిటి నాయనా? అసలు దెయ్యాలంటూ వుంటేగా! మనిషిలో వున్న భయమే దెయ్యం. ఆ భయంతో దేన్నిచూసినా దెయ్యమే అనిపిస్తుంది. వికృతంగా వున్నవాడిని దెయ్యం అనమూ మనం? అంతే. సరే-యిక కథ వినండి."

"వాడి దేవుడిగదిలో పెద్దపెద్ద భయంకరమైన పటాలు, రెండు మనిషి పుఱ్ఱెలు, యింకా యేవేవో వెఱ్ఱివెఱ్ఱి విగ్రహాలు, ఒక పెద్దకత్తీ వుండేవి. వాడు తెల్లవారుఝామున నాలుగుగంటలకల్లా స్నానంచేసి, గంటన్నరసేపు 'హ్రీం, హ్రీం, హ్రూం, ఫట్' అంటూ అరుస్తూ యేదో జపం చేసేవాడు.'

'అయితే తాతా...ఆ డెలాగుండేవోడు?' తిరిగి ప్రశ్నించేడు వెంకటరెడ్డి.

'ఓలూరుకోగా...పిరికీ! నీ కన్నీ అనమానాలే. సెపితే సెంకలు కొడతావు...' సుబ్బన్న వెక్కిరించేడు.

'వాడి సేడిపించకు రాసుబ్బిగా...

శ్రీ అంగర వెంకటకృష్ణారావు

నేను చెపుతాగా...నల్లగా, యెత్తుగా, పోతులా వుండేవాడు. మొక్కజొన్నపొత్తుమీది పీచులాంటి చింపిరిజుత్తు, భోగిమంటల్లాగ ఎర్రటి కళ్లు, యింతకో పెదిమా, అంతకో పన్నూ...'

ఈ వర్ణనకి కొందరు హుషారెక్కేరు. కొందరు హడిలేరు. వెంకటరెడ్డి పళ్లు బిగుసుకున్నాయి.

'ఆ వీరప్పరాజు యెవ్వరికీ లక్ష్య పెట్టేవాడు కాదు. బీదవాళ్ళనీ, పిరికివాళ్లనీ జడిపించి వాళ్లదగ్గర డబ్బు నిర్దయగా గుంజేవాడు. ప్రయోగాలు చేసీ ప్రాణంతీస్తానని బెదిరించేవాడు...'

'తాతా! తెలవకడుగుతాను. పయోగాలంటే యేటి?' మళ్లీ ప్రశ్నించేడు వెంకటరెడ్డి. సుబ్బన్నకి రిమ్మెత్తుకొచ్చింది. 'ఈ. .పిరికినా యాలకి చందేగాలు నావు. గుండెల్లో సూత్తే గుబులుగుబులు. పల్లకుండ నేడు...'

'తిట్టకురా సుబ్బిగా. వాడి కనుమానంకలిగితే నేను తీరుస్తా..ఒరే రెడ్డీ! ప్రయోగాలంటే, దెయ్యాల మంత్రగాళ్లు కిట్టనివాళ్ల మీద తమ మంత్రశక్తిచేత దెయ్యాల్ని వొదిలి వాటిచేత బాధపెట్టిస్తామంటారు. పాపం—యీ బూటకపు ప్రయోగాల్ని నమ్మిన అమాయకులు, నిజంగా దెయ్యాలు బాధపెట్టినట్టే బాధపడతారు.'

అలా చెప్పడమే తడవుగా రెడ్డి 'ఓలమ్మో' అని లేచి తాత మెడ పట్టుగున్నాడు. అతడు విడిపించుకుని, వాడికి ధైర్యంచెప్పి కూచో బెట్టేడు 'ఎందుకురా అంత భయం! అసలు దెయ్యాలు లేవనే చెప్తానుగా! దానినిబట్టి ప్రయోగాలు బూటకమని తేలిందికదూ?'

'ఔనండి' అన్నాడు వణకుతూనే.

'అయితే యింకెందుకు భయం! ఇక కథవిను...జపం ముగించి వాడు వూరు తెల్లవారకుండా రోడ్డు కడ్డంగా వాలుకుర్చీమీద పండిలా పడుకొనేవాడు. అసలే మనవీధి యిరుకా! వాడు కూచుంటే యిక మనుష్యులు మెసలడమే కష్టంగా వుండేది. పైగా తెల్లవారిలేచి పళ్లు తోముకుందికి వీధిఅరుగుమీదకు రాగానే యమదూతలాగు వీడు హాజరు!

'వీడెలా కూచునేవాడో తెలుసా. ఈపక్కనో ముక్కాలి పీట, ఆ పక్కనో ముక్కాలిపీట. దీని మీద తమలపాకులు, దానిమీద వక్కలు, యాలకులు, లవంగాలు వగైరా కాళ్లు జాపుకుందికి ముందరివైపు ఒకబల్ల. ఇలా శవంలా పడు



కుని, సావకాశంగా తాంబూలం వేసుగుంటూ, ఒచ్చీపోయేవారి వేపు చింతనిప్పల్లాంటి కళ్లతో చూస్తూండేవాడు; యేడుగంటల యెండ వాడి మొహాన్న కరకర పొడిచేదాకా.'

'ఆడిని నరికేనేకపోయిన్రా!' అన్నాడు సుబ్బన్న.

'ఎలాగ' ఎవడూ వాడిదగ్గరకెళ్ల. లేకపోయేవాడు. మీదకి దెయ్యాల్నొదిలేస్తాడేమోనని ప్రతివాడికీ భయం. వుదయాన్నే యేటికి, నీళ్లకోసం వెళ్లే పడుచుపిల్లలవేపు పని పెట్టుగుని పరకాయించి చూస్తూ 'దుర్గా!' అని, 'జగ్రదక్షకే' అని 'లలితే' అని యేవో పేర్లుపెట్టి పిలుస్తూండేవాడు. చిన్నవాళ్లవడం చేత వాళ్లు జడుసుగునేవారు. బెంగపెట్టుగుని వూష్ణంవస్తే, వీడే దెయ్యం పట్టిందని పేర్లుపెట్టి హడలుకొట్టించి డబ్బు లాగేవాడు వాళ్ల వాళ్లదగ్గర నుంచి. వాడంటే పోస్టుమేష్టారికీ భయమే, అమీనుగారికీ, హెడ్ గుమాస్తాగారికీ అందరికీ భయమే.'

'మరి నీకో తాతా!' అన్నాడు వెంకిగాడు పెంకిగా.

'తాతకిమాత్రం బెయ్యంగం దట్రా! తాత మనిశా; ముగవా?' అన్నాడు సుబ్బన్న.

'ఓరినాగమ్మా! నేను గాదురా మృగాన్ని. వాడురా - ఆ వీరప్పరాజు! వాడి దెయ్యాలంటే నాకు భయంలేదు. వాడంటేనే. ఊరపందిలా వుండేవాడు. పైగా వాడిదగ్గర బారెడుకత్తి వోటివుండి యేడిసిందిగా! కాని యెలాగైనా వీడి భరతం పట్టాలని పట్టుదలపట్టాను.

'హెడ్ గుమాస్తాగారు వాడింటికెదురింట్లోనేగా వుండేవారు! ఓమారు వాడితో, నయాన్నే అన్నారు, 'పంతులుగారూ, మీరా వరండాలోనే కూచుంటే బాగుంటుందేమో. పొద్దున్నే మంచుకురుస్తూంటుందికదా' అని. వాడు మండిపడ్డాడు. 'భగవతి నన్నిక్కడే కూచోమంది, ఇది తప్పించగలిగే వాడు బ్రతికివున్నవాళ్లలో లేడు. నాయనా! నీకీ వుద్దేశం యేల కలిగింది? ఇది బాగుపడేవాళ్లకి కలగవలసిన సందేహంకాదే!' అన్నాడు. వీడి తాడుతెగ, వీడితో మనకెందుకని ఆయన వూరుకున్నారు.

తరవాత ఓనాటిరాత్రి అంతా పోస్టుమాస్టారింట్లో సమావేశమై యీ పీడని యెలా ఒదిలించుకోవడమని ఆలోచించాం. అంతా యేవేవో చెప్పేరేకాని, యెవరూ స్వయంగా ధైర్యంచేసే యేర్పాటులో లేరు. పోలీసువాళ్లకి కూడా భయమేగా దెయ్యాలంటే!

'అబ్బాయిలూ అప్పుడు నేనే తెగించేను. 'చూడండి, వీడిని యెల్లుండి మధ్యాహ్నానికి యిక్కడ నుంచి మకాం యెత్తిస్తా' నన్నాను. అంతా ఆశ్చర్యపోయేరు. 'ఎలాగరా సుబ్బులు' అన్నారు నన్ను చుట్టేసి. 'ఇప్పుడేం చెప్పను; చూదురుగాని నా మజా' అని వెళ్లిపోయేను. నే నన్నట్టే ఆ వీరప్పరాజులు దెయ్యాలపంతులుగాడు ఆ యెల్లుండివుదయం పదిగంటలకు డబ్బాడవాలుతోసహా యీ వూరి నుంచి దయచేసేడు. కథ కంచికి మనం యింటికీ, పొండి-' అన్నాడు సుబ్బుబ్బితాత; పైబట్ట దులుపుకొంటూ.







పిల్లలంతా గొల్లుమన్నారు. 'మాకంతా చెప్పు తాతా! నువ్వేం చేసేవో చెప్పాల్సిందే' అన్నారు గోలపెడుతూ.

'నే నొక్కడినీ యేం చెయ్యగలన్రా! మీలాంటి మరిద్దరి సాయంతో వాడిని పూరిపైటకు గెంటేశాను'

సుబ్బన్న చెవులు చాటలంతేసి అయేయి. 'ఏటేటి తాతోయ్! నాలాంటివోళ్లే! సెప్పు తాతా-ఆళ్లు నానాగున్నారా?'

'చెప్పేనుగదరా. అచ్చంగా నీలాగే: రెండు అడ్డగాడిదలు.'

'గాడిదలా!!' అంతా ఆశ్చర్యపోయేరు.

'ఔన్రా! ఆ మర్నాడుదయాన్నే రెండు బలమైన గాడిదల్ని పట్టి, వీధికొసనున్న బడిపెరట్లో కట్టేసేను. వాటికి తిండిపెట్టలేదు. రెండుమూడుసార్లు వెళ్ళి చితకతన్నేను. ఆరాత్రి మరోసారి వెళ్ళి తన్నేను. అప్పుడవి యెలావున్నాయంటే, వదిలేస్తే మెరుపుల్లా దౌడు తీసెయ్యటానికి సిద్ధంగా వున్నాయి.

'మర్నాడుదయం ఐదుగంటలకు యేట్లో స్నానంచేసి, ప్రత్యేకంగా వీరప్పరాజు దెయ్యం రోడ్డుకడ్డంగా కూచున్న స్థలంమీదుగా వెళ్ళి, వాడున్నదీ లేనిదీ చూసుగుని నమస్కారంచేసేను. వాడు గర్వంగా నన్ను దీవించేడు; 'భగవతి నిన్ను రక్షిస్తుందిరా!' అని. నాలో నేననుకున్నా 'గాడిదలు నీ పని పట్టిస్తాయిరా' అని.

'అబ్బాయిలూ. ఇక కథ జాగ్రత్తగా వినండి. మజా అంతా యిక్కడే వుంది. తొలినాడు రాత్రే పొడుగాటి ఆరు కొబ్బరిమట్టలు సంపాదించేను. మూడేసి కలిపి ముక్కోణాకారంగా కట్టి, కొసువేపు తాడుతో గట్టిగా గాడిదల తోకలకి కట్టేశాను. ఈపనిచెయ్యడానికి మరి నలుగురిసాయం తీసుకున్నాలెండి. అర్థంలేనికథ అనుకొని మీలో గడుసుకుంకలు కొట్టిపారేస్తారేమో!

'అలాకట్టి ఆ రెండుగాడిదల్నీ దెయ్యాలపంతులింటి ముఖంగా వదిలాను.

'అడ్డంగావున్న కొబ్బరిమట్టలు రోడ్డుకీపక్కా ఆ పక్కా తగులుతున్నాయి. వాటికి దిట్టంగా బ్రహ్మచెముడుపట్టలు తుమ్మముళ్ళ, డొంకలు నిండా కట్టించేను. ఇంకా మసకమసక వెలుతురుగావున్న ఆ వుదయంవేళ కోపంతో మండిపోతూన్న ఆ రెండుగాడిదల వీపుల మీదా దుడ్డుకఱ్ఱలతో చరోటి ఒడ్డించి వదిలేసన్రా. ఇక చూసుకోండి. అవి వురకలేస్తూ 'ఓ! ఓ! ఓ!...'అని ఓండ్రపెడుతూ, తోకలకున్నవాటికి మరీ బెదిరి, ఫెడీఫెడీమని తన్నుకొంటూ దౌడు లంకించుకున్నాయి.

'అప్పుడు మన దెయ్యాలపంతులు యీ పక్కనొక బల్ల, ఆ పక్కనొకబల్ల, కాళ్లముందొక బల్ల వేసుగుని హాయిగా తాంబూలం సేవిస్తున్నాడుకదూ! ఈ గాడిదలు, అరుస్తూ కరుస్తూ, నురగలతో వురకలతో, ఊపులతో తాపులతో, పంతులు వున్నవైపే బ్రహ్మప్రళయంలా వస్తూన్నాయి. బల్లలమధ్య టిక్కడిపోయిన పంతులుకి మతిపోయింది. 'టకటక,' 'ధనాధన్,' ఒక గాడిద పంతులుమీంచి యెగిరి చెంపమీద ఫెడీమని తన్నింది. వెనువెంటనే రెండోదొచ్చి పంతులు మీద నాలుగుకాళ్లతో కూలిపోయింది. అది మరీ బెదిరి, అతన్ని ఫెడీఫెడీమని వరసగా తన్ని పరుగు లంకించుకున్నాయి. తిరిగి పంతులు ముక్కోణపు ముళ్లకంచెలమధ్య యిరుక్కున్నాడు. కాని ఆ జంతువు లాగుతాయా! అతడిని బరబరా యీడ్చుకు పరుగెత్తజొచ్చేయి. ఆ జుజ్జుమధ్య చిక్కుకుని, యీండ్రిగిల బడుతూ, ముళ్లపోటులు, గాడిదెల తాపులు తింటూ పంతులు డొల్లి డొల్లి చివరకి సైదుకాలవలో పడ్డాడు. ఈ ఆర్భాటానికి యిళ్లలో పడుకున్నవారందరూ లేచివచ్చేరు.

'ఎనిమిదిగంటలకు దెయ్యాలపంతుల్ని ఆస్పత్రిలో చేర్చేరు. నేను వెళ్లిచూసి విచారం నటిస్తూ 'భగవతి మిమ్ములను రక్షించుగాక' అన్నాను. ఆనాడు పదింటికే అతడిని విజయనగరం ఆస్పత్రికి మోసుకుపోయేరు. నాటికీ నేటికీ పంతులు ఖబరు లేదు. కథ యిప్పుడు కంచికి మనం యిక యింటికి' అని ముగించేడు సుబ్బులుతాత.

పిల్లలు డొల్లిడొల్లి నవ్వేరు.






(గతసంచిక తరువాయి)

"ఏమోయ్ సుందరం ! యీ గడియారాలను తయారు చెయ్యటంలోనూ, రిపేరు చెయ్యటంలోనూ అంతంత చిన్నచిన్న పనిముట్లతో పనిచేసిన ఆ యింజనీర్లే, యీ ప్రపంచంలో ఎంతెంత పెద్దపనులు చేశారనుకొన్నావ్ ! నూలు వడికేందుకు, బట్ట నేసేందుకు యంత్రాలు ఎప్పుడైతే తయారైనాయో, యిక అప్పటినుంచీ ప్రపంచంలో మనుష్యులు చేసేపని తగ్గిపోయింది. ఫ్యాక్టరీలు వెలిసేసరికి పట్టణాలు పెరిగాయి. పల్లెలు ఖాళీ అయినాయి. ఇంతెందుకు 18 వ శతాబ్దంలో ప్రపంచం ప్రపంచం అంతా ఒక్కమారుగా మారిపోయింది. 18 శతాబ్దాలపాటు జరుగని మార్పులన్నీ నూరు, నూటవభై సంవత్సరాలలో జరిగిపోయాయి. ఇంత వేగంగా యింత పెద్ద మార్పు వచ్చిందంటే అదంతా ఆయింజనీర్ల చలవే. ఆ యింజనీర్లంతా గడియారాలు తయారుచేసే వ్యక్తులలోనుంచీ తయారు అయినవారే. అందుచేత ప్రపంచం అంతా ఒకవిధంగా గడియారాలకు ఋణపడి వున్నది."

గడియారం వాక్యం ముగించేలోగానే, సుందరం అందుకొని "అబ్బోసి" అని వెక్కిరించాడు.

"పో నీ లే; గడియారా లంటే నీకేమో అంత యిష్టంలేకుండా వున్నదిగా ! 'మనియారా' లంటే ఏమిటో నీకు తెలుసా ?"

"'మనియారాలా' ? ఈమాట ఎప్పుడూ వినలేదే ?"

"'మనియారాలంటే...'" ఈలోగా గడియారం కడుపులో దేవటం మొదలైంది. కొండశిల కదిలింది. గడియారం గుండె చిక్కబట్టింది. వూపిరి బిగబట్టి 8 గంటలు కొట్టింది. కొండశిల మళ్లీ యథావిధిగా చుట్టలు చుట్టుకు నిద్రకు పడ్డది. అంతసేపూ సుందరం చిరాకుగా వేచివున్నాడు.

"ఇదొక పీడ. గంటకు, అర గంటకూ కడుపులో పేగులన్నీ కదలి కదిలి సాకు చచ్చినంత పని అవుతుంటుంది. మీకోసం యీ గంటలు కొట్టకతప్పటంలేదు. ఎంత బాధఅయినా, విధి యిలా వున్నప్పుడు అనుభవించక తప్పుతుందా !" అంటూ గడియారం వేడి నిట్టూర్పు ఒకటి విడిచింది.

"మనియారాలంటే ఏమిటో చెప్పు, త్వరగా?" సుందరం పురమాయించాడు.

"ఆ ! అదే...ప్రాణం లేకపోయినా, గుండె కొట్టుకొంటూ చేతులు తిప్పుకొంటూ గంటలు లెక్కపెట్టేయంత్రాన్ని గడియారం అంటున్నారా లేదా! అట్లాగే ప్రాణం లేకపోయినా మనుష్యులకు కావలసిన పనులన్నీ చేసిపెట్టే యంత్రాలని 'మనియారా' లని మనం అందాం."

"అలాంటి యంత్రాలు వున్నాయా ఎక్కడైనా ?"

"లేకేం? వెనుకటికొక యింజనీరు తన యింట్లో వంట చేయించుకోవటం మొదలుకొని, వీధివాలికి వూడ్చే పనివరకు అన్ని పనులూ యిలాటి 'మనియారాల' తోనే చేయించుకొన్నాడు. ఆయన తెలివితేటలనన్నిటినీ వుపయోగించి మనుష్యాకారంలో వుండే కొన్ని యంత్రాలు తయారు చేశాడు. ఒక యంత్రానికి మీట

నొక్కితే గబగబా వంట చేసేస్తుంది. మరొకదానికి మీటనొక్కితే పక్కపరుస్తుంది. మరొక దానికి మీటనొక్కితే బూట్సుకు పాలిష్ పెట్టేస్తుంది. ఆయన యీయంత్రాల విషయంలో ఒక చిన్న చిలిపి పని కూడా చేశాడు. ఈ మనియారాలకు బుర్ర వుపయోగించే అవకాశం ఎలాగూ లేదు కాబట్టి, వాటికసలు తలకాయలే లేకుండా బొమ్మలు తయారు చేశాడు. మామూలుగా తలవుండే చోట-అంటే మెడమీద — ఒక పెద్ద 'క్వొస్చెన్ మార్కు' ఆకారంలో తీగ నొకదానిని వంచి తగిలించాడు."

"చమత్కారంగావున్నదే."

"అవును చాలా చమత్కారంగా వున్నది. ఆ యింజనీరు యింట్లో తల వున్నవాడు తానొక్కడుతప్ప యింకెవ్వరూ లేరు. ఇంటిపని అంతా యీ తలలేని పెద్దమనుష్యులచేతనే చేయించుకొనేవాడు. తలవుండే మామూలు మనుషుల కంటే, తల లేని యీ మనియారాలు ఎంతో నమ్మకంగా వుండేవి. ఏపని ఎప్పుడు చెయ్యమన్నా, సణగకుండా గొణకుండా చేసి పెట్టేసేవి. ఇస్తున్న జీతం చాలటంలేదని పేచీ పెట్టటం కానీ, రోగం వచ్చిందనీ రొంప పట్టిందనీ పని ఎగగొట్టటం కానీ యీ మనియారాలకు చేతనే కాదామె.''

"ఈ ఏర్పాటు బాగానే వుంది. మా స్కూల్లో కొందరు మాష్టర్లున్నారు. వాళ్లకు తలలువుండికూడా దమ్మిడీ ప్రయోజనం లేదు. అలాంటి వాళ్లందరినీ తీసేసి యిలాంటి మనియారాలకే పాఠాలుచెప్పే పని అప్పగిస్తే బాగుండును."

"ఆ రోజులూ వస్తాయేమో! ఎవరు చెప్పగలం? బొమ్మలచేత ఆటలు ఆడించి, పాటలు పాడించిన వాళ్లు ఎంతమంది లేరూ! అలాగే బొమ్మలచేతే పాఠాలు చదివించే వాళ్లు కూడా తయారు అవుతారేమో!"

పాటలుపాడే బొమ్మల పేరెత్తేసరికి సుందరానికి బలే సరదా వేసింది. "పాటలు పాడే బొమ్మలన్నావే? అవేవో కొంచెం వివరంగా చెప్పగలవా?" అని అడిగాడు.

"ఆ చెప్తాను."

(ఇంకావుంది)



"అమ్మా! అమ్మా! నాన్నగారు నిద్దరలేచారు."

# దేవదేవుని దురవస్థ

(21-వ పేజీ తరువాయి)

అంతట విసయిపోయి, "నేనేనండి కలిసింది" అన్నాను ఎరక్క.

శ్రీవారు రుద్రులై పోయి, "ఓరీ! నీచా! కాలేజీగుడ్డల కంపుతో కాఫీ జేసి పోస్తివి గదరా! సన్యాసీ! చూడు, నీ పాపిష్టి చేతి నేమి చేసెదనో" అంటూ వొక గడ్డిపోచను కైకొని నా కుడిచేతిమీద వేశారు. "*My God!* ఏం *Tragedy!*"

కొంచెము తెప్పరిల్లుకొని చూచేసరికి, నేను మంచంక్రింద ఉన్నాను. శ్రీవారు కనపడలేదు. చేయి చూసుకు నేసరికి బొబ్బ యెక్కి వుంది!

నేను మరొకసారి ఉవ్వెత్తుగా ఉప్పొంగిన ఆశ్చర్యాంబుధిలో స్నానము జేస్తూండగానే, గదిలోంచి మా బావ అంటూన్న మాటలు వినిపించాయ్.

"ఇదిగో! మీ తమ్ముడు ఏదో ప్రైజులు కొట్టేడని సంతోషిస్తుంటివే, చూడు. చేతిమీద సిగరెట్ అంటించినా తెలివిరాని మొద్దుని." ★

# అయాచిత సత్కారం

(11-వ పేజీ తరువాయి)

వాడనేసరికి ఎందుకన్నానా ఆమాట అని పశ్చాత్తాపబడ్డాను. సరే ప్రయత్నిస్తాలే అన్నాను. వాడూ కొండంతభారం వదలినట్లుగా తృప్తిగా వెళ్ళిపోయాడు.

రోజులు గడచినవి. నేనూ యీ విషయాన్ని సంపూర్ణంగా మరచి పొయ్యాను. రోజూ డిప్టీమాజస్ట్రేటు యింటికి పోతూనే ఉన్నాను. రావూ మాయింటికి వస్తూనే ఉన్నాడు. యిద్దరం కొరుషి కొర్లూ క్లబ్బురోమాన్సూ నడుపుతూనే ఉన్నాం. కానీ ఎన్నడూ నే నావిషయం ప్రస్తావించనే లేదు. అతడూ యిలాంటి విషయాలు నాతో ఎన్నడూ మాట్లాడలేదు.

ఒకరోజున అదే కుర్చీలో కూర్చొని పదేండ్లనాటి పాతపేపరు చదువుతున్నాను. పెళ్లాం పుట్టింటికి వెళ్ళింది. మనస్సు చికాకుగా ఉంది. యింతలో నే పోస్టుబ్యాను వచ్చి తలుపుతట్టాడు. నాకేమైనా పేపరు వచ్చిందా అన్నాను. మీకు ఏదొందలు మనియార్డరూ ఒక రిజిష్టర్డ్ కవరూ వచ్చిందండీ అన్నాడు. నాన్నాలు జీవితంలో ఎన్నడూ యీ ఫైకి మించి మనియార్డర్ రాలేదు. ఏ హిందీపత్రికా సంపాదకుడూ నాకు పదికి మించి పంపలేదు అని విడ్డూరపడుతూ డబ్బు తీసికొని పోస్టువాడి మామూలు వాడికిచ్చి కవరు చించి చదివాను.

డియర్ బ్రదర్, కృష్ణుడిని వదిలిపెట్టారు. అనుకున్నంతా నెరవేర్చావన్న మాట. ప్రాసిక్యూషన్ సాక్ష్యం బలంగా ఉంది. ఐనా కేసుకొట్టివేయబడింది. కారణ మెవ్వరికీ తెలియదు నాకు మినహా. ఈ నా కృతజ్ఞతాపూర్ణమైన బహుమానాన్నంగీకరించగలవని ప్రార్థన. —శేఖరం ★

# బైజుబావర

(31-వ పేజీ తరువాయి)

నిసరిగా తన ఓటమిని స్వయంగా ఒప్పుకొన్నాడు.

ఇక యెవరు మాత్రం ఏం చేయగలరు? అక్బరుబాదుషా కంటతడి పెట్టుకొని బైజూను పిలిచి, తాన్‌సేన్‌కు యెటువంటి శిక్ష విధిస్తావో విధించుకోమని అతని ప్రాణాల్ని బైజూకు వప్పగించేశాడు. తాన్‌సేన్‌తో పాటుగా, చక్రవర్తి, ప్రజలూ కూడా బైజూ ఉరిశిక్షే విధించగలడని నమ్మారు. కాని బైజూ సవినయంగా, "ప్రభూ నాసరస్వతి పరులకు హానిచేసే నిర్భాగ్యురాలు గాని నిర్దయురాలు గానీ కాదు. నాగురువుకు యిచ్చిన వాగ్దానాన్ని బట్టి, ఎందరి ప్రాణాలనో బలిగొన్న యీ విద్వాంసునికి సయితం, నేను కీడు చేయలేను. కాని చిన్నమనవి నాదొకటి. మీరు మన్నించాలి. నేటినుండి ఆగ్రా నగరంలో వున్న యీ కఠినశాసనాన్ని రద్దుచేయాలి. అదే నాకు పదివేలు"

అంతటితో చక్రవర్తి కళ్లకు క్రమ్మిన మాయపొర తొలగిపోయింది కృతజ్ఞతతో పరిపరివిధాల బైజూను పొగిడి, యెంతో గౌరవంచి, సత్కరించాడు. ప్రజలుసైతం బైజూను దేవతామూర్తిగా గౌరవించారు. తాన్‌సేన్ తన పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చి వెక్కివెక్కి యేడ్చాడు. దానితో అతని హృదయభారం తగ్గిపోయింది.

బైజూ ఆ తర్వాతకూడా తన గానకళా నైపుణ్యాన్ని పరోపకారానికే ఉపయోగించి తన కీర్తిని శాశ్వతంగా నిలబెట్టుకున్నాడు. ★



"ఎదురు చూపు"

# రెండు మహానగరాలు

(13-వ పేజీ తరువాయి)

చేశాడు. పెళ్ళాన్ని కూడా అదే హుకుంచేశాడు. రాత్రి ఒంటిగంటవరకూ తానుమాత్రం చుట్టమీద చుట్ట కాలుస్తూ అలాగే కూర్చున్నాడు. ఒంటిగంటకల్లా లేచి జేబులోనుంచి చిన్ని తాళంచెవితీసి అలమారా తెరిచాడు. దాల్లోనుంచి ఒకసంచీ, పటకారూ, ఒక తాడూ, గొలుసు ఇంకా యీ రకమైన చేపలు బట్టటానికి పనికివచ్చే యితర సామానూ బయిటికి తీసుకున్నాడు. ఇవ్వన్నీ జాగ్రత్తగా సర్దుకుని బయలుదేరాడు. వెడుతూ వెడుతూ, నిద్రపోతున్న భార్యవంక కడసారి ఒక్క ఊరు మురిమి చూసి తలుపు దగ్గిరేసి బయలుదేరాడు.

జర్రీ, తండ్రి బయలుదేరేదాకా దొంగ నిద్రపోయి, అతను గడప కదలగానే నెమ్మదిగా లేచి, పిల్లిలా అతని వెనకాతలే చీకట్లో బయలుదేరాడు.

తండ్రి కథేవిటో తెలుసుకోవాలని జర్రీకి ఆందోళన బయలుదేరింది. ఆ చీకట్లో, తండ్రిముందూ, కొడుకు ఫర్లాంగు దూరం వెనకా నడిచిపోతున్నారు. క్రంచర్ ఉత్తరదిశగా మళ్లీ కొంచెం దూరం వెళ్ళాడో లేదో మరొక మనిషి యెవరో వచ్చి అతనితో కలిశాడు.

మరో అర్ధగంట నడిచేసరికల్లా దీపాలూ గట్రా లేని ఊరి బయటి రోడ్డుమీదికి వచ్చేశారు. అక్కడికి వచ్చేసరికి మరో మూడో వ్యక్తి వచ్చి వాళ్ళని కలుసుకున్నాడు. ఒకరికి యిద్దరూ ఇద్దరికి ముగ్గురూ అయ్యారు. ఆ ముగ్గురూ ముందూ, జర్రీ చాటు చాటుగా వెనకా నడిచిపోతున్నారు.

అలా పోయిపోయి రోడ్డుకు అడ్డంగావచ్చిన ఒక కాలువ గట్టుదగ్గిరికి చేరుకున్నారు. ఆ గట్టు దిగి పక్కనున్న చిన్ని ఇటుక గోడను సమీపించారు. దానికి ఒకచోట ఇనపచువ్వలతో అమర్చిన ఒక గేటు వుంది.

కుర్రాడు గట్టుకివతల నక్కి మెడపైకెత్తి నిక్కి చూస్తున్నాడు. గేటుచువ్వలమీదుగా ఎగబాకుతూ తండ్రి కనుపించాడు. అతను క్షణంలో గేటుదిగి లోపలికి వెళ్ళిపోయాడు. మళ్లా చేపలు బట్టటానికి బయలుదేరిన ఆ రెండో పెద్దమనిషీ, మూడో పెద్దమనిషీ కూడా గేటుదాటి లోపల ప్రవేశించారు.

వాళ్లు ముగ్గురూ లోపలికి వెళ్లిపోగానే, కుర్రాడు కూడా గేటుదగ్గిరికి వెళ్లి కిటికీచువ్వలలోనుంచి లోపలికి తొంగి చూచాడు. లోపలికి వెళ్లిన ఆ ముగ్గురూ, పచ్చగడ్డిలోనుంచీ, గోరీల దిబ్బలమధ్యనుంచీ బడి, జెర్రిపోతుల్లా ప్రాకిపోతున్నారు. అలా కొంతదూరం పాకిపోయి, ఒక దిబ్బదగ్గిరికొచ్చి ముగ్గురూ నిటారుగా లేచి నిల్చున్నారు. ఇక అక్కడ చేపలుబట్టే కార్యక్రమానికి ఉపక్రమించారు.

మొట్టమొదట పార దీసుకుని కొంతసేపుతవ్వారు. అనంతరం క్రంచర్ జేబులోనుంచి పటకారులాటిది ఏదో బయటికిదీసి దాంతో సదమదంగా పనిచేస్తున్నాడు. వాళ్లు ఉపయోగించుతున్న పనిముట్లేవిటో కుర్రాడికి సరీగా కనుపించటంలేదుగాని అలా చాలాసేపటివరకూ తంటాలు పడుతూనేవున్నారు. ఈలోగా చర్చిగడియారం గంటలు కొట్టడంతో కుర్రాడు కంగారై కొంచెం దూరంగా పారిపోయాడు. కాని ఆ వ్యవహారం ఏవిటో పూర్తిగా తెలుసుకోవాలనే ఉత్సాహంతో వుండటంచేత మళ్లా ధైర్యం చిక్కబట్టుకుని వెనక్కి తిరిగివచ్చాడు ఇంకా వాళ్ళేదో పనిచేస్తూనేవున్నారు. ఈసారి కిరకిరగా ఏదో శబ్దంకూడా కొద్దిగా వినపడుతోంది. ఆ గోతిలోనుంచి బయటికి వస్తూన్న చేప ఏవిటో కుర్రాడికి అర్థమైపోయింది. తన తండ్రి స్వయంగా పటకారు తీసుకుని దాన్ని పగలగొడుతూవుండటం అతనికి మరింత బేజారుపుట్టింది. కాళ్ళకు బుద్ధి చెప్పాడు. మైలూ, మైలున్నర పోయేవరకూ, వెనక్కి తిరిగి చూడకుండా పరుగెత్తాడు. అక్కడైనా ఆయాసమొచ్చి ఆగాడుగాని లేకపోతే ఆగేవాడే గాదు. ఆ శవపేటిక తనవెంట పరుగెత్తుకొస్తున్నట్టు అతనికి భ్రాంతి కలుగుతోంది. ఆ శవపేటిక నిట్టనిలువుగా నిల్చుని తనమీదికి పరుగెత్తుకువస్తున్నట్టూ, తన దండచేతిని పట్టుకోవటానికి ప్రయత్నించుతున్నట్టూ గాబరాగా వుంది. చీకటిగా వున్నచోట మరింత భయమేసిపోతోంది. అందుచేత చెట్లక్రీనీడలూ అవీలేని రోడ్డుమీదికి పరుగెత్తుకొచ్చాడు. అది తోకలేని గాలిపటంలా గాలిలోకి యెగిరి తనమీదికి దూకబోతున్నదని అలజడి పడుతున్నాడు. అలా నురుసులు గ్రక్కి పరుగెత్తుకుంటూ ఇంటికి చేరుకునేసరికి అతని ప్రాణం ఇంచుమించు కడబట్టిపోయింది. లోపలికి వెళ్లినాక కూడా యింకా ఆ భయం వదల్లేదు. కిక్కురుమనకుండా పోయి పక్కమీద పడుకున్నాడు. నిద్రపోతున్నప్పుడుకూడా ఏదో గుండెల మీదకూర్చున్నట్టుగానే వుంది తెల్లవారి కుర్రాడు నిద్రలేచేసరికి ముందు గదిలో, తండ్రి తల్లిని తల గోడకి వేసి కొడుతూవుండటం చూశాడు.

'అంతపనీ చేస్తానని చెప్పేనా లేదా—చావు' దబాదబా గోడకేసి తల పగలగొట్టేస్తున్నాడు. చస్తినో అని ఆ యిల్లాలు లబోదిబో ఏడుస్తోంది.

'ఇదేటే ఆడదానికి ఉండాల్సిన బుద్ధీ—మొగాడికి యెదురు తిరగటమా—మొగాడికొచ్చే లాభాలు కాస్తా నాశనమైపోవటానికి ప్రార్థనలు చేస్తావా బాడఖావ్ !'

'నువ్వు అల్లాంటి పాడుపనిలోకి దిగాల్సిందేగాదు మరి' అన్నది కళ్లనీళ్లు గారుస్తూ.

'మొగాడి యవహారాల జోలి ఆడదానికి నీకు అనవసరం,' అంటూ మళ్లా ఒకతాపు తన్నిపోయి నేలమీద బోర్లబొక్కలుగా పడుకుని కాళ్లు పంబదన్నాడు. తండ్రి పడుకోటం చూసి కొడుకు కూడా మళ్ళీ పడుకుని నిద్రపోయాడు.

ఆవేళ భోజనందగ్గిర చేపలూ జట్రా అల్లాంటివేమీ లేవు. ఇతర పదార్థాలుకూడా ఏవీలేవు. క్రంచర్ వాళ్లో మనసూకూడా చికాగ్గా వుంది. భార్య గనక దైవప్రార్థనలు వగైరాకు పూనుకుంటే శిరచ్ఛేదం చెయ్యటానికి ఒక ఇనుపశిబ్బి దగ్గిర బెట్టుకు కూర్చుని ఆ రెండు రొట్టెలూ ఆదరాబాదరా గొంతులో వేసుకుని మింగాడు. నిమాజామా వేసుకు, కుమారుణ్ణి వెంటబెట్టుకుని మళ్లా యథాప్రకారం గౌరవనీయమైన తనఉద్యోగానికి బయలుదేరాడు.

త్రోవను పోతూ, చేతికి అందని దూరంలో నిల్చుని కొడుకు తండ్రిని నెమ్మదిగా ప్రశ్నించాడు.

'పూడ్చిపెట్టిన శవాల్ని తవ్వుతారే—అళ్లు యెవుళ్ళయ్యా ?—'

క్రంచర్ దిగ్భ్రాంతుడై నిల్చునిపోయాడు! 'నా కేవిటి తెలుసు'

'అదంతా నీకు తెలుసు ననుకుండాలే'—

'హుఁ—సరే!—అదా ?—అళ్లో యాపారస్థుల్లే'—

'ఆళ్లు అమ్మే సరుకు లేంటి ?'—

'అయ్యేవో సైన్సుకు సంబంధించిన సరుకుల్లే'—

'మడుసుల శవాలా ?'—

'మరే !—అసువంటివే యేవో అయివుంటయ్'—

'పెద్దయినతరవాత నే గూడా అలాంటి యాపారస్థుణ్ణవుతా' అన్నాడు జర్రీ.





అనిల్ పిక్చర్స కార్పొరేషన్ వారి హిందీ 'శీశమ్'లో

నూతన్, నసీర్.

# ప్రభుత్వానికీ ఫిల్మ్ పరిశ్రమకూ
## ప్రచ్ఛన్న యుద్ధం

ఫిల్మ్ పరిశ్రమవారికీ ప్రభుత్వానికీ "కోల్డ్ వార్" జరుగుతున్నట్లు తోస్తుంది. ఈనెల 7వ తేదీన బొంబాయిలో జరిగిన ఫిల్ము పారిశ్రామికుల సమావేశంలో ఈ విషయం స్పష్టపడింది. సమావేశంలో భారతదేశ మంతటినుండీ వచ్చిన ప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు, స్టూడియో యజమానులు, ఇంకా పరిశ్రమకు సంబంధించిన ఇతరులు పాల్గొన్నారు. చందూలాల్ షా అధ్యక్షతను జరిగిన ఈ సమావేశాన్ని భారతప్రభుత్వ సమాచార శాఖామంత్రి డా॥ బి. వి. కేస్కార్ ప్రారంభించారు.

డా॥ కేస్కార్ తన అధ్యక్షోపన్యాసంలో ఫిల్ముపారిశ్రామికులను ఘాటుగా విమర్శించారు చందూలాల్ షా తన అధ్యక్షోపన్యాసంలో ప్రభుత్వాన్ని అంతకన్నా ఘాటుగా విమర్శించారు. ప్రభుత్వం తమ పరిశ్రమను ప్రోత్సాహపరచవలసింది పోయి నిరుత్సాహపరుస్తోందనీ, ఫిల్ము విచారణసంఘంవారి సిఫార్సులను అమలు పరచటంలో జాప్యం చేస్తోందనీ చందూలాల్ షా విమర్శించారు.

డా॥ కేస్కార్ మాట్లాడుతూ, నేటి చలనచిత్రాల స్థాయి నైతికంగా పతనమైందనీ, నైతికప్రమాణాల విషయంలో మన నిర్మాతలు హాలీవుడ్‌ను గుడ్డిగా అనుకరిస్తున్నారనీ, హాలీవుడ్ నైతిక ప్రమాణాలు అమెరికాకే ఎబ్బెట్టుగా ఉంటుండగా మన దేశాని కెలా పనికివస్తాయనీ, అన్నారు.

"ఒకవంక మన చరిత్రను, సంస్కృతిని, సంప్రదాయాలను, సంఘాన్ని అవమానిస్తూ, మరొకవంక సినిమాపరిశ్రమ అభివృద్ధి కావాలంటే అభివృద్ధి కాదు... సినిమా చిత్రాలకు ప్రజలను వినోదింపజెయ్యట మొక్కటే ప్రయోజనం కాదు; సాంఘిక ప్రయోజనంకూడా ఉన్నది... పత్రికలకు అభిప్రాయప్రకటన స్వాతంత్ర్యమిచ్చినట్లే సినిమాలకుకూడా ఇవ్వాలని, సెన్సార్ పద్ధతిని పూర్తిగా రద్దుచేయాలని కొందరు కోరుతున్నారు.

నిర్మాతలు తమ చిత్రాలను తామే సెన్సార్ చేసుకునే పద్ధతిమీద సెన్సార్ రద్దుచేయటానికి ప్రభుత్వానికేమీ అభ్యంతరం లేదు.

అలా జరగటంలేదుకనక ప్రభుత్వం సెన్సార్ పద్ధతిని ఇప్పుడు రద్దుచెయ్యజాలదు...చిత్రాల నైతికస్థాయి వెంటనే పెరగనిపక్షంలో ప్రభుత్వం ఇంకా కఠినంగా సెన్సారింగ్‌ను అమలు చేయవలసి వుంటుంది," అని కేస్కార్ హెచ్చరిక చేశారు.

చందూలాల్ షా సినిమారంగంలో అరాజకం ప్రబలిందని, ప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు స్వలాభాలకోసం ఒకరితో ఒకరు పోటీపడి పరిశ్రమను చెడగొడుతున్నారనీ ఒప్పుకుంటూ, ప్రభుత్వం తమకు వెంటనే చెయ్యదగిన సహాయమల్లా ఫిల్ము విచారణసంఘం సిఫార్సు చేసినట్టు పన్నులభారం తగ్గించటమే నన్నారు. విచారణసంఘపు సిఫార్సులు తామింకా పరిశీలిస్తున్నామనీ, ఏమైనా చిత్రాలస్థాయి పెరగనిదే పన్నులు తగ్గించే ఆలోచన



"జమానే కీ హవా"లో అభినేత్రి ముంతాజ్ శాంతి.



కృష్ణాపిక్చర్సువారి "అమ్మలక్కలు"లో అమ్మలక్కలు:
ఎస్. డి. సుబ్బలక్ష్మి, సూర్యకాంతం, అంగముత్తు.

పట్టుకోమనీ కేస్కార్ అన్నారు. ఉభయులమధ్యా ఈ ప్రచ్ఛన్నయుద్ధం సాగినంతకాలమూ సినిమారంగం ఇప్పుడున్న స్థితిలోనే ఉంటుంది

సినిమారంగంలో అరాజకం నిండివున్న సంగతి నెవరూ కాదనలేరు నిర్మాతలలో నిర్మాతలకు పోటీలున్నాయి ఒకరి కథలనొకరు దొంగిలించటం, ఒకరి చిత్రం పేరు మరొకరు దొంగిలించటం మొదలైన చేష్టలకు కూడా కొందరు నిర్మాతలు లోనవుతున్నారు. అలాగే డిస్ట్రిబ్యూటర్లలో డిస్ట్రిబ్యూటర్లకు, ఎగ్జిబిటర్లలో ఎగ్జిబిటర్లకు పోటీలు. తిరిగి అందరిమధ్యా వాటాలకోసం పోటీలు. వీటన్నిటివల్లా ముఖ్యంగా స్వతంత్ర నిర్మాతలు విపరీతనష్టం పొందుతున్నారు "తారల పద్ధతి"వల్లకూడా పరిశ్రమకు నష్టం సంభవిస్తోంది ఈ అరాజకాన్ని నిగ్రహించవలసిన ఆవశ్యకతను బొంబాయిలో సమావేశమైన ప్రతినిధులందరూ గుర్తించటం ముదావహమైన విషయం. "స్వయం నిగ్రహం" ప్రతిపాదనను మొదట్లో ఒకరు (వాసన్ ప్రతినిధి) ప్రతిఘటించారు గాని చివరకు ఆయన కూడా మెత్తబడ్డారు. ఈ ప్రతిపాదన ప్రకారం ఫిల్మ్‌ఫెడరేషన్ కార్యవర్గం ఒక తీర్మానం తయారుచేస్తుంది. ఆ తీర్మానాన్ని ఫెడరేషనుసభ్యులు, దాని అనుబంధసంస్థల సభ్యులు ఆమోదించి ఆ ప్రకారమే నడుచుకుంటారు. చిత్ర నిర్మాణానికి కావలసిన పెట్టుబడిదగ్గిర్నుంచి, డిస్ట్రిబ్యూటింగ్, ఎగ్జిబిటింగ్ వ్యవహారాల వరకూ అన్నీ ఆ తీర్మానానుసారమే జరుగుతాయి సెప్టెంబరునాటికి ఈ తీర్మానం తయారుకావాలనీ, వచ్చేసంవత్సరం జనవరినుంచీ "స్వయం నిగ్రహం" అమలు జరగాలనీ అధ్యక్షుడు చందూలాల్‌షా సభ్యులను కోరాడు.

ఈలోగా ప్రభుత్వంకూడా తమ కఠిన వైఖరిని సడలించటం అవసరం. భారతీయ చిత్రాల నైతికపతనాన్ని ఘాటుగా విమర్శించిన డా॥ కేస్కార్ తమ ఉపన్యాసంలో హాలీవుడ్ చిత్రాలను సమర్థించారు. "భారతీయ సంఘానికి ఎబ్బెట్టుగా ఉండే భారతీయ చిత్రాలకన్న అమెరికన్ సంఘానికి ఎబ్బెట్టుగా వుండే అమెరికన్‌చిత్రాలు చాలా తక్కువ"ని ఆయన అన్నారు. నిజానికి అమెరికన్ సంఘానికే కాదు, ఏ సంఘానికైనా ఎబ్బెట్టుగా ఉండే చిత్రాలనేకం హాలీవుడ్ సినిమా ఫ్యాక్టరీలలో తయారవుతున్నాయి. మానవుడిలోని పాశవికతను ఆకాశాని కెత్తేసే కథావస్తువులకు హాలీవుడ్ ఈనాడు పుట్టిల్లు. అగాధమూ, అత్యున్నతమూ అయిన మానవత్వచిత్రణను చూడాలంటే ఇటలీ, జపాన్ చిత్రాలకేసి తిరగాల్సిందే.

ఫిల్మ్ విచారణసంఘం చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి· వినోదంపన్ను కొంత తగ్గించాలి, ఫిల్మ్‌కౌన్సిలు నొకదాని నేర్పరచాలి; ఫిల్మ్ ఫైనాన్సు కార్పొరేషను

# "అంబర్" సమీక్ష

జగత్ పిక్చర్సువారి "అంబర్" హిందీ చిత్రం గత శుక్రవారంనుండీ మద్రాసు అశోక్, రాజకుమారీ టాకీస్ లలో ప్రదర్శింపబడుతోంది ఈ చిత్రంలో నర్గీస్, రాజ్ కపూర్ ముఖ్యపాత్రధారులు కథను జానపదకథ అవటం జానపద కథలకు అవమానకరమైనప్పటికీ, కథాకాలం ఇప్పటిది కాదుగనకా, కథకు చారిత్రికాధారం లేదుగనకా, సాధారణంగా జానపదచిత్రాల్లో కనిపించే అసందర్భ విషయాలు, స్టంటులు ఉన్నాయిగనకా 'జానపద' చిత్రమనే అనాలి నాయికానాయకుల గుర్రపుస్వారీ, పిస్టళ్లు ఉన్నప్పటికీ కత్తియుద్ధాలు, లేకపోయినా ఇబ్బంది లేని పాటలు, నృత్యాలు, ముఖ్యంగా రాజ్ కపూర్ బఫూన్ చేష్టలు, ఇంగ్లీషు నృత్యభంగిమలు, నర్గీస్ జలక్రీడలు ఇవి ఈ చిత్రంలో పేర్కొనదగిన అంశాలు.

ఒక రాజుకొడుకు తండ్రికి తెలియకుండా కొండజాతినాయకుని కుమార్తెను రహస్యవివాహము చేసుకుంటాడు. ఆమెకొక కూతురు పుడుతుంది. రాజుకొడుకు నెవరో హత్యచేస్తారు; భర్తృవియోగం సహించలేక ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది కొండజాతినాయకుడు తన మనమరాల్ని ఫలానా అని తెలియనీకుండా రాజభవనంలో ప్రవేశపెడతాడు. రాజు ఎవరో బీదపిల్ల అని తలచి తన కుమార్తెవలె పెంచుతాడు. ఆమె పెరిగి పెద్దదవుతుంది. ఆమె పేరే అంబర్ (నర్గీస్) ఆమెను కొండజాతి నాయకుడు కలుసుకొని జన్మవృత్తాంతమంతా చెప్పి, "నీ తండ్రిని చంపింది నిన్ను పెంచిన రాజే అతన్ని చంపి పగ తీర్చుకో," అని చెబుతాడు. అంబర్ రాజును చంపటానికి సమయంకోసం వేచివుంటుంది. కాని రాజును "రాజ్" అనే అంగరక్షకుడు (రాజ్ కపూర్) ఎప్పటికప్పుడు రక్షిస్తూ ఉంటాడు. అంబర్, రాజ్ ఒకరొకరు ప్రేమించుకుంటారు ఈలోగా మంత్రి, మంత్రికొడుకు రాజును తొలగించి రాజ్యం అపహరించాలని పన్నాగం పన్నుతారు రాజును ఖైదుచేసి మంత్రి గద్దె ఎక్కుతాడు మంత్రిని చంపి మంత్రికొడుకు గద్దె ఎక్కుతాడు అతణ్ణికూడా రాజ్ చంపేస్తాడు. చివరకు తన తండ్రిని చంపించింది రాజుగారు కాదని అంబర్ తెలుసుకుంటుంది అంబర్, రాజ్ పెళ్ళి చేసుకుని హాయిగా ఉంటారు.

ఈచిత్రం డైరెక్టుచేసింది జయంత్ దేశాయి; సంగీతం గులాం మహమ్మద్; ప్లేబాక్ పాటలు లతా మంగేష్కర్, రఫీ వగైరాలు; ఆఘా, బిపిన్‌గుప్త, రమేష్‌సిన్హా, నాయంపల్లి, కూకూ మొదలైనవారు నటించారు. నర్గీస్ నటన అందానికి తగినట్టుగానే వుంది. కాని రాజ్ కపూర్ నటన అతని కీర్తికి తగినట్టులేదు; సినిమాలలోకంటె సర్కస్ లలో బాగా రాణిస్తాడు ప్రత్యేకం కాలక్షేపం, వినోదంకోసమే ఈ చిత్రం తీసినట్లయితే విజయవంతం అయిందనే చెప్పాలి



స్థాపించాలి, అని ముఖ్యంగా ఫైనాన్స కార్పొరేషను విషయం ప్రభుత్వం ముందుగా ఆలోచించాలి అగ్పాలైన చిన్న నిర్మాతలకు కార్పొరేషనుద్వారా ప్రభుత్వం ధనసహాయం చేయటంవల్ల ప్రస్తుతం చిత్రనిర్మాణంపై డిస్ట్రిబ్యూటర్లకు, ఇతర పెట్టుబడిదార్లకు ఉన్న అధికారం చాలవరకు తొలగిపోతుంది. బ్రిటన్‌లో కొన్నేండ్లక్రితం ప్రభుత్వం ఇలాటి కార్పొరేషనునే ఏర్పాటుచేసింది. దానివల్ల స్వతంత్ర నిర్మాతలకు అమూల్యమైన సహాయం జరుగుతున్న విషయం అందరికీ తెలిసినదే ప్రభుత్వం ఇతర సహాయాల విషయం ఎలా ఉన్నా, ముందు ఈ ఆర్థికసహాయంగూర్చి చర్య తీసుకోవటం అవసరం.





జగత్ పిక్చర్సువారి "అంబర్"లో రాజ్ కపూర్, నర్గీస్.

## సినిమా వార్తలు

### "పేదరైతు"

రాజరాజేశ్వరీ వారు జెమినీ స్టూడియోలో తీస్తున్న సాంఘిక చిత్రం "పేదరైతు" పూర్తికావచ్చింది. తెలుగులోను, అరవంలోను ఈచిత్రం ఒకేసారి తయారవుతున్నది. నిలకడగా సుస్థిరంగా చిత్రాలు నిర్మిస్తున్న సంస్థలలో రాజరాజే

శ్వరీ ఫిలిమ్స్ ఒకటి "పేదరైతు" ఈ సంస్థ వారి పదియవ ప్రొడక్షను కె నాగభూషణం గారే చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు కన్నాంబ, అంజలీదేవి, ఎమ్. శ్రీరామమూర్తి, రేలంగి, దొరస్వామి, లింగమూర్తి, డి సదాశివరావు, తులసి, ముత్తులక్ష్మి మొదలైనవారు నటిస్తున్నారు. పాటలు, మాటలు కొప్పరపు సుబ్బారావు; సంగీతం హెచ్. ఆర్ పద్మనాభశాస్త్రి; నృత్యం చోప్రా.

మూడువంతులకుపైగా చిత్రం తయారై ప్రస్తుతం ఆఖరి సెట్టుమీద పని జరుగుతున్నది అగస్టు 15 కల్లా నిర్మాణం పూర్తవుతుందనీ, అక్టోబరు 16 కు గాని విడుదల చేయమనీ నిర్మాతలు తెలుపుతున్నారు. ప్రస్తుత సంఘపరిస్థితులనే చిత్రించాలనే ఆశయంతో ఇటీవల తెలుగులో పలువురు నిర్మాతలు ముంగుకు వస్తున్నారు. "పేదరైతు" కథావస్తువు జమీందారుకూ రైతుకూ మధ్య సంఘర్షణపై ఆధారపడినదే. "దున్నేవాడికే భూమి" అని ఈ చిత్రం ఇవ్వబోతున్న సందేశం ప్రజానీకాన్ని గాఢంగా ఆకర్షించగలదనటంలో సందేహం లేదు. కన్నాంబ జమీందారుభార్యగా నటిస్తున్నది. శ్రీరామమూర్తి ఆమె కుమారుడుగాను, అంజలీదేవి అతడు ప్రేమించిన పల్లెపిల్లగానూ, దొరస్వామి ఆమె తండ్రి (పేదరైతు) గానూ నటిస్తున్నారు లింగమూర్తి ఎస్టేటు మేనేజరుగా (విలన్ అని వేరే చెప్పనక్కరలేదు) నటిస్తున్నారు జమీందారు (సదాశివరావు ) మంచం పట్టిన మనిషి జమీందారిణియే ఎస్టేటు వ్యవహారాలన్నీ మేనేజరు దుర్బోధల సహాయంతో చూస్తూవుంటుంది. ఆమె కొడుకు పేదరైతుకూతురును ప్రేమించి వివాహమాడగోరుతాడు. ఈ విధంగా జమీందారుగృహంలో కలహం రేగుతుంది. కథాంతంలో జమీందారు బెడిసి కొట్టిన వ్యవహారాలను హస్తగతం చేసుకొని, కుటుంబంలోనూ, ఎస్టేటులోనూ కూడా సామరస్యం సాధిస్తాడు తన భూములన్నిటినీ పేదరైతుల స్వాధీనం చేస్తాడు.

ప్రస్తుతం పని జరుగుతున్న సెట్టు జమీందారు భవనాంతర్భాగం

## "పుట్టిల్లు" రషెస్

ఇటీవల పత్రికలవారికి "ప్రివ్యూ" ఇవ్వకుండానే నిర్మాతలు తమ చిత్రాలు విడుదల చేయటం పరిపాటిఅయింది పత్రికలవారికి ముందుచూపిస్తే, వారు చిత్రం అధ్వాన్నంగా ఉందనిరాస్తే, చిత్రం అపజయం పొందుతుందని వారి భయమై ఉండవచ్చు, లేక పత్రికలవారికి చూపవలసిన అగత్యం లేదని వారి భావమై ఉండవచ్చు. ఏమైనా ఇందువల్ల మద్రాసులోని పత్రికలవారికి తెలుగులో విడుదల



రాజా ప్రొడక్షన్సువారి "పుట్టిల్లు"లో మిక్కిలినేని, అతని తల్లిగా రమణి భూస్వామి ఘంటయ్య ధర్మయ్య ఇంటిని జప్తు చేశాడు. జబ్బుతో మంచానపడిన శాంతను ఘంటయ్య మనుషులు నిర్దాక్షిణ్యంగా లాగివేసి మంచం తీసుకుపోతారు.

అయ్యే చిత్రాలనుగూర్చి ఏమీ తెలియకుండా పోతున్నది (మద్రాసులో తెలుగు చిత్రాలు ముందుగా విడుదల చేయక పోవటానికి కారణంకూడా అంతుపట్టటం లేదు )

డా॥ రాజారావుగారు ఈమధ్య తాము తీస్తున్న "పుట్టిల్లు" చిత్రం రషెస్ పత్రికల వారికి చూపించారు ఇది వారి ఆత్మవిశ్వాసానికి నిదర్శనం. చిత్రంలో తార అని చెప్పదగిన నటిగాని, నటుడుగాని ఎవ్వరూ లేరు చాలమంది తెరకు కొత్తవారే. రాజారావుగారు 'స్టార్ వాల్యూ' మీద కాకుండా కథాబలంమీదనే ఎక్కువగా ఆధారపడుతున్నారు. నాయికాపాత్రకు పెద్ద అందగత్తె అని చెప్పటానికి వీల్లేని కొత్తనటిని తీసుకోవడంలోకూడా ఆయన ఆత్మవిశ్వాసం కనబడుతున్నది. ఆడపిల్లల చదువుసమస్య, పెళ్లిసమస్య, సంఘంలో స్త్రీకిగల స్థానం, గ్రామాల్లో షావుకార్ల దోపిడి ఇలాటివే "పుట్టిల్లు" కథలో ప్రధానాంశాలుగా కనిపిస్తాయి

మోడరన్‌థియేటర్స్‌వారి "అత్తింటి కాపురం" తెలుగుచిత్రం ఈనెల 24 న 20 ఆంధ్రకేంద్రాల్లో విడుదల అవుతుందట ఈ చిత్రంలో బి. ఎస్ సరోజ, నంబియార్ ముఖ్యపాత్రధారులు; డైరెక్టర్లు ఆచార్య, ముస్తాక్, సంగీతం దక్షిణామూర్తి; పాటలు మాటలు తోలేటి . మోడరన్‌థియేటర్స్‌వారు "సవతిపోరు" అనే ఇంకొకచిత్రం తీస్తున్నారు దీనిలో జానకి, మాలతి సవతులుగా నటిస్తున్నారు. డైరెక్టరు ఉస్తాన్ సంగీతం దక్షిణామూర్తి; పాటలు మాటలు తోలేటి.

* * *

ప్రకాష్ ప్రొడక్షన్సువారు మరొక కొత్తచిత్రం నిర్మించాలనే ఆలోచనలో ఉన్నట్లు తెలిసింది. ఈ చిత్రం స్క్రిప్టు దశలో ఉన్నదట మాటలు పాటలు శ్రీశ్రీ, ఆరుద్ర కలిసి రాస్తారట తత్కాలికంగా ఆ చిత్రాన్ని చెరసాల లేక కటకటాలు అని వ్యవహరిస్తున్నారు

మహబూబ్‌వారి "ఆన్" టెక్నికలర్ చిత్రం హిందీభాషలో ఆగస్టు 1 న, తమిళంలో ఆగస్టు 7 న విడుదల అవుతున్నది. తమిళచిత్రం మద్రాసులో కృష్ణాటాకీస్‌కు వస్తున్నది సొహరాబ్ మోడీ తీసిన "ఝాన్సీకీ రాణీ" టెక్నికలర్ చిత్రం దీపావళినాటికి గాని విడుదలకాదట ఈ చిత్రం తాలూకు కాపీలు తీయించటానికి సొహ్రాబ్ మోడీ ఈమధ్య మెహతాబ్‌తో కలిసి లండను వెళ్లారు.

హాలీవుడ్ స్టూడియోలలో రంగుల చిత్రాల నిర్మాణవ్యయం బాగా తగటం వల్ల మరొక ఏడాది తర్వాత తయారయ్యే చిత్రాల్లో నూటకి 75 వంతులు రంగులోనే తయారవుతాయట. వార్నర్స్ స్టూడియో వారు వచ్చే పన్నెండు నెలల్లో తయారు చేసే 33 చిత్రాలలో 27 చిత్రాలు రంగులలో తయారుచేస్తారు హాలీవుడ్‌లో ఉన్న స్టూడియోలలో ఏ స్టూడియోకి ఆ స్టూడియో సొంతంగా ఒక్కొక్క రంగుల ప్రాసెస్ కనిపెట్ట ఉపయోగిస్తున్నారు ఎమ్ జీ ఎమ్ వారు ఆన్‌స్కోకలర్, వార్నర్స్ వారు వార్నర్ కలర్ ఉపయోగిస్తున్నారు. ఇవిగాక ఇతర స్టూడియోలవారు సినీకలర్, సూపర్ సినీకలర్, ట్రూకలర్ ఇంకా ఏవో రకరకాల కలర్ విధానాలను ఉపయోగిస్తున్నారు కాని హాలీవుడ్‌లో అన్నిటికంటే ఎక్కువ ఉపయోగంలో ఉన్నది టెక్నికలర్ విధానం టెక్నికలర్ కంపెనీవారు ఇప్పుడు ఏడాదికి 40 కోట్ల అడుగుల ముడిఫిలిం తయారుచేస్తున్నారట మరొక ఏడాదిలో ఈ ఉత్పత్తిని 60, 80 కోట్ల అడుగుల వరకూ పెంచుతారట ఈ అంకెలను బట్టి హాలీవుడ్ సినిమాకంపెనీలవారు ఏటా ఎంత టెక్నికలర్ ముడిఫిలిం ఉపయోగిస్తున్నారో తెలుసుకోవచ్చును. 



అవర్ ఇండియావారి "నాయిల్లు"లో విద్యావతి.

# ప్రశ్నలు సమాధానాలు

బి. శ్రీహరిరావు—సంగారెడ్డి

కిందటి వారపత్రికలో ఓ సమాధానంగా స్వామీజీ సాగిస్తున్న నిరశనవ్రతం గూర్చి నిర్లక్ష్యంగా, అసందర్భంగాను సెలవిచ్చారు సత్యాగ్రహంవల్ల మన కోరికలు సంపాయించుకోలేరంటారా? (అయితే గాంధీజీ 42 లో సాగించిన సత్యాగ్రహం? మీ అభిప్రాయం తప్పంటా-యికనయినా సవరించుకుంటారా?

—మా అభిప్రాయం గురించి ఏమనుకోడానికైనా మీకు హక్కుంది. 'సత్యాగ్రహ భజనల్ని' గురించి మా అభిప్రాయం ఇంకా మారలేదు.

వానిరెడ్డి కృష్ణమూర్తి—చేబ్రోలు.

కళ్ళూ, చెవులూ రెండూ వుండి కూడా వినా లేనివాళ్ళ నేమనాలి?

—నోరుగలవాళ్ళనవచ్చు.

శ్రీ శ్రీ; ఆత్రేయ, ఆరుద్ర అభ్యుదయ రచయితలుగారా?

—కాదనీ అవుననీ ఎవరన్నారు

అధికారములో వున్న కాంగ్రెస్ నాయకులను విమర్శించడమంటే మీకు భయమా? లేక వారి తప్పులను తప్పులనడం తప్పా?

—మిత్రులంటే భయందేనికి? తప్పుల్ని తప్పులనడంలో తప్పులేదు కాని, తప్పులు కానివాటిని కూడా తప్పులనడం తప్పకుండా తప్పు

* * *

జవ్వాజి శేషావతారం—నరసరావుపేట

మొన్న విడుదలఅయిన "కాంచనా" తెలుగు సినిమాలో జమీందారు అడ్డగుడ్డ కట్టటం, పేటఅంచు కండవా, చెవులకు దుద్దులు పెట్టటం— అది డైరక్టరు యొక్క లోపమంటాను మీరు నాతో ఏకీభవించుతారా?

గొంగళిలో అన్నంతింటూ వెంట్రుకలు ఏరటానికి ప్రయత్నించటం వృథాప్రయాస

* * *

అకుంచి వెంకటపున్నయ్య—బాపట్ల.

విజయావారి "పెండ్లిచేసి చూడు" సినిమాలో వదినగారిని పెండ్లికానికన్య గర్భాధానగృహమునకు తీసికొనివెళ్లుట యేదేశాచారమో సెలవిస్తారా?

"సావిత్రి"ని గర్భాధానగృహంలోకి తీసుకువెళ్లింది పూటకూళ్లవ్వ; "అమ్మడు" ఊరికే వెంట ఉన్నది.

* * *

కె. శ్రీనివాసరావు—భీమవరం.

ఆంధ్రరాష్ట్ర స్థాపనకోసం ఐక్య ఉద్యమనిర్మాణం అవసరమనికమ్యూనిస్టులు చేసే ప్రచారంపట్ల మీ అభిప్రాయమేమి?

—రాష్ట్రసాధనకంటె పార్టీకక్షలు ప్రధానమైనప్పుడు, 'ఉద్యమాలూ' 'ఆందోళనలూ' మరింత కక్షలకూ విషమ పరిణామాలకుమాత్రమే దారితీయగలవు

* * *

ముదిగొండ మాధవరావు, ఆర్య—శికిందరాబాదు

మధుబాల ఒలికించే చిలిపిచిరునవ్వు యొక్క విలువెంతండీ?

కనీసం మీరు చెల్లించే టిక్కెట్టు విలువంతయినా ఉంటుంది

* * *

జి. అంజయ్య—హైద్రాబాదు

సినీతారలు స్క్రీన్ పైన కనబడే అంత అందముగా వాస్తవజగత్తులో కూడా వుంటారా?

అలా ఉండాలనే వారి నిరంతర ప్రయత్నం

* * *

భాలకి మధుసూదనరావు—విజయవాడ.

ప్రతిపార్టీ నాయకుడూ విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనరాదని అంటూండటం సహజమే అయినా, మరల ప్రతి రాజకీయ పార్టి తమ పార్టీకి అనుబంధశాఖలను విద్యార్థులలో నిర్మింప యత్నిస్తూంటాయి ఇందలి నగ్నసత్యాన్ని సెలవిస్తారా!

—బహుశా తమ పార్టీమినహా ఇతర పార్టీల రాజకీయాలలో పాల్గొనకూడదని ఆ నాయకుల అభిప్రాయం కావచ్చు.

* * *

మం. శివకిరణ్ బాబు—తెనాలి

విజయావారు "పెళ్ళిచేసిచూడు" హిందీ వెర్షను కొంత టెక్నికలర్ లో తీస్తారట అది ఎంతవరకు సఫలమైందో చెప్పగలరా?

చిత్రం అంతా "గేవాకలర్"లో తీయాలని వారి సంకల్పం అందుకోసమే తమ లాబొరేటరీ చీఫ్ సేన్ గుప్తను యూరప్ పంపించారు

* * *

బి. లక్ష్మీనారాయణ—సికిందరాబాదు.

నేటి చలనచిత్రరంగంలో ప్రవేశించిన కొద్దిరోజులకే కొందరు నటులు దర్శకులై కూర్చుంటే, ఎక్కువ చిత్రాలలో నటించి పేరుతెచ్చుకున్న నాగేశ్వరరావు దర్శ

కుడై ఒక మంచిచిత్రాన్ని తీయకపోవడానికి కారణ మేమిటి ?

—పూర్వపువారికయిన అనుభవాలు తెలుచుకుని ఆయన సాహసించి ఉండలేకపోవచ్చు.

*　　*　　*

ఆర్. బసవరాజు—చెన్నపట్నం.

'ఆంధ్రపత్రికలో యెల్లప్పుడూ ప్రచురణ మయే 'సీరియల్స్' అన్నీ, ఇంగ్లీషునవలలనే అనువదించి వ్రాయుటకు కారణ మేమి ? తెలుగులో నవలలు వ్రాయువారు లేరనియా లేక తెలుగునవలలు పాఠకలో కొన్ని రంజింపచేయవనియా ?

తెలుగు నవలల్ని ఇదివరలో ప్రచురించి ఉన్నాం. పరభాషలలోని ఉత్తమ నవలల్ని కూడా తెలుగుపాఠకులకి అందించాలని మా ప్రయత్నం.

*　　*　　*

యు. వి. సుబ్బారావు—కాళహస్తి.

తెలుగుచిత్రములకు, హిందీచిత్రములకు గల ముఖ్య భేద మేమి ?

—హిందీచిత్రాలకు హాలీవుడ్‌చిత్రాలు మాతృకలు. తెలుగు చిత్రాలకు హిందీ చిత్రాలు మాతృకలు.

బి మంగరాజు—బొబ్బిలి.

సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీ, ఈ రెండుపార్టీలకు కామ్రేడ్ అని పిలిచెదరు కాని కాంగ్రెసుకు పిలువకపోవుటకు కారణ మేమి ? కామ్రేడ్ అంటే ఉద్దేశ్య మేమిటి ?

—సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాలు రెండూ పాశ్చాత్యదేశాలలో పుట్టి మన దేశానికి వ్యాపించాయి కాంగ్రెసు ఉద్యమం మనదేశంలోనే ప్రారంభమైనది. కనుకనే పాశ్చాత్య సంప్రదాయ ప్రకారం మన సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా "కామ్రేడ్" అనే మాటను వాడతారు ఈ మాటకు అర్థం "సహచరుడు."

*　　*　　*

పి. యస్ యన్ మూర్తి—నరసరావుపేట

రాజాజీ పేరుచెబితే కమ్యూనిస్టులకు గంగవెర్రు లెత్తడానికి కారణమేమిటి ?

—ఈ గంగవెర్రులు పార్టీలమధ్య అవో రకం సరసాలు.

*　　*　　*

యాతం రాఘవమణి—పరిమెళ్ళ.

సెక్సు అప్పీలు, స్టార్ అప్పీలు మొదలైన బాక్సాఫీసుసూత్రాలను తూచా తప్పకుండా తీసిన చిత్రాలు దెబ్బతినుటకు గల కారణం ?

—ప్రేక్షకులు నిర్మాతలు భావించినంత తెలివితక్కువవాళ్లు కాకపోవటమే.

వాసిరెడ్డి రామనాథం—వీరులపాడు.

'భారతదేశంలో ముందుముందు కమ్యూనిస్టుపార్టి అభివృద్ధిజెందటాని కెక్కువ అవకాశమున్నదా లేక సోషలిస్టుపార్టీయా ? రెండుపార్టీల మూలసిద్ధాంతాల్లోగల భేద మేమి ?

—రాజకీయపార్టీల భవిష్యత్తు జ్యోతిశ్శాస్త్రానికి అతీతమైన విషయం. వర్గ రహిత సమాజాన్ని రాజ్యాంగబద్ధమైన ఆందోళనద్వారా సాధించవచ్చునని సోషలిస్టులు, విప్లవంద్వారానే సాధించగలమని కమ్యూనిస్టులు విశ్వసిస్తారు

*　　*　　*

కా శ్రీనివాసరావు—తడ.

"కవితా కన్యక గుణాలు
కవికన్న రసజ్ఞు డెఱుగు గవి
　　　　యేమెఱుగున్ ?"

ఇది ఎంతవఱకు నిజమండీ ?

—అందుకే కవితాకన్యకకి కవి తండ్రి వంటివాడు, రసజ్ఞుడైన పాఠకుడు భర్త వంటివాడు అన్నారు మన పెద్దలు

*　　*　　*

క ఆదిశేషారెడ్డి—అలూరు

"బొమ్మరిల్లు"లో "ట్వీడ్ సూట్" లను చూపించినందువలన, ఏవిధముగ విద్యార్థులు బాగుపడగలరని భావించుచున్నారు ?

—బొమ్మరిల్లు కథలు పిల్లలేకాకుండా పెద్దలు కూడా చదువుతారు కాబట్టి ట్వీడ్ సూట్లు కుట్టించగల తాహతువున్న తండ్రులకు యీ రూపేణా అయినా హెచ్చరిక చేసినవారమౌతామన్న ఆశతో.

*　　*　　*

డైరెక్టరు ప్రసాద్ అడ్రసు తెలియజేస్తారా మహాశయా ? అత డిప్పుడు ఏ పిక్చరు డైరక్టు చేస్తున్నాడు ?

—నం 109, మూడవ మెయిన్‌రోడ్డు, గాంధీనగర్-అడయార్, మద్రాసు.

ప్రసాద్ గారు స్వంత చిత్రాన్ని, అంజలీవారి "పరదేశి"ని, జూపిటర్ వారి "మనోహర", హిందీ "పెళ్లిచేసి చూడు" డైరెక్టు చేస్తున్నారు. కృష్ణాపిక్చర్సువారి "అమ్మలక్కలు", రాజ్యంపిక్చరు "దాసి" సూపర్‌వైజు చేస్తున్నారు.

*　　*　　*

టి శ్రీదాస్—సూళ్ళూరుపేట.

"హా !", "ఆన్" చిత్రలను తెలుగులో కూడా తీస్తున్నారా ?

—రాజ్ కపూర్ "హా !" తెలుగులో కూడా తీస్తున్నారు (డైలాగ్సు ఆరుద్ర).

మహబూబ్‌వారి "ఆన్" హిందీ, తమిళంలోనే తయారైందిగాని తెలుగులో తయారవటం లేదు.

*　　*　　*

# వరహీనం
## (7-వ పేజీ తరువాయి)

### 3

ఇలా పదిరోజులు గడిచాయి. అక్కడ నుండి వచ్చే వుత్తరానికి ఎదురు తెన్నులు చూస్తూ కూచున్నాను ఓ రోజున కాలేజీ నుండి వచ్చేటప్పటికి వదిన, "మీ మామ గారి దగ్గరనుండి, ఉత్తరం వచ్చిందోయ్" అంటూ వెటకారంగా నవ్వుతూ ఓ ఉత్తరం అందించింది

ఆత్రంగా ఉత్తరం చదివాను కాళ్లు భూమిమీద లేనట్టుగా తేలిపోతున్నయ్. ఇంతకీ ఉత్తరం సారాంశం ఏమిటంటే, "వరహీనమవుతుం దేమోననే భయంచేత మీ సంబంధం వదలుకున్నాము" అని. నాకు నోట్లో తడి ఆరిపోయింది. పైకి ఏమన్నా. అంటే బావుండదని వూరుకున్నా. పైగా వరహీనమవుతుందంటా డేమిటి, ఆయన సంబంధం చూసుకోడానికి? ఇంకో కారణం చెప్పినా బావుండేది, నే నింతా బాధపడకపోదును. ఇంతట్లో అమ్మ "నే నప్పుడే అనుకున్నాను. వీడి కప్పుడే పెళ్ళేమిటీ అని. ఇంకా ఒక చెంపకొడితే పాలు, ఇంకో చెంప నీళ్ళు కారుతుంటేను" అంది. మా అమ్మ మళ్ళా మొదటికొచ్చింది. నాకు చెంపను పాలు కారడమేమిటి కొడితే? సాచి నేను కొడితే నే ఎదటి వాడికి రక్తంవచ్చే వయస్సు వచ్చినప్పుడు?

"పాపం, ఇంత చిన్నప్పుడే పెళ్ళొద్దని వాడు చెప్పనే చెప్పాడుగా! ఇంతకీ ఆయ నొప్పుకోన్నా, మనవాడు ఒప్పుకో నేవాడు గాడులే" అని అన్నయ్య అన్నాడు. కాదురా బాబూ; పరిస్థితులు మారాయి అమ్మాయిని చూడంతోటే, చేసుకుందా మనే అనుకున్నాను, అన్న మాటలు నోటిదాకా వచ్చినా బలవంతాన ఆపుకున్నా.

"ఏమిట్రోయ్ నువ్వు చూసుకున్న ప్రతీ సంబంధం వరహీనమవుతోంది? మొన్న అమ్మాయిని చూస్తే వరహీనమే గాకుండా ఆ అమ్మాయికి పెళ్ళి కూడా అయిపోయింది. పోనీ పెళ్ళిగాని పిల్లని చూసుకుంటే "మళ్లా వరహీనమయి వూరుకుంది" అని మా వదిన నోట్లో చీరకొంగు కుక్కుకుంటూ వస్తున్న నవ్వు ఆపుకుంటూ అంటోంది

"ఇంతెందుకు పట్టుపంచ అయినా సరిగ్గా కట్టలేడు, అప్పుడే పెళ్ళేమిటి వీడికి! కట్టబోతే తెరచాపలాగ లేస్తుంది వెనకాల" అని నాన్న అన్నారు నవ్వుతూ

"అయితే వోపని చేయవోయ్ ఇవాళ నించి పట్టుపంచ కట్టకోడం అలవాటు జేసుకో బాగా వచ్చిన తర్వాత పట్టు పంచతోనే పిల్లని చూడ్డాని కెళ్ళు పెద్దవాడిలా కూడా కనబడతావు దాంతో వరహీనం, గిరహీనం అన్నీ గూడ తప్పుతుంటాయి" అని వదిన వంటింట్లోకి వెళ్లిపోతో అంది. ★









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి









తెలివిగల కుందేలు పిల్లా మందమతియగు సత్వసారుని అడవి నడుమన పాడునూతికి తోడుకొని పోయెన్!



























Rgd No. M. 4479